కాలేజి చదువుల తేలేవు గానీ కాసింత తగ్గాలీ
వేలాది వేల రూపాయలున్నా వినయం చూపాలీ-



## అన్ని విధములా దివ్యమైనది






సీసాలలోను పౌడర్ వలె ట్యూబ్ లోను లభించుచున్నది.

మీ శిరోజములను నలుపు చేయును. పోషించును మరియు పొడవుగా పెంచును
యౌవనవంతముగా మెరయుచూ పట్టువలె మృదువుగా వుంచును

లోమ ఏజెంట్లు మరియు పంపిణీదారులు:
ఏమ్. ఏమ్. అంబర్ వాలా
రాయపూర్, అహమదాబాద్-1. (గుజరాత్)
ఏజెంట్లు: ఎ. నరోత్తమ్ అండ్ కం., బొంబాయి-2.

ఏజంట్లు
రసిక్ లాల్ & కంపెనీ, 233, గోవిందప్పనాయక్ వీధి, మద్రాస్—1.

## నాఫ్తా తిలక్

స్త్రీల సౌందర్యమునకత్యవసరము
చక్కని 5 రంగులలో దొరకును
ఫ్యాన్సీ సామానుల వర్తకులందరు అమ్ముదురు




ఏజంట్లు:
నేషనల్ ప్రొడక్ట్స్ సిండికేట్,
మద్రాసు-21

# 35 పైసల మిగులు!

## 'హేజలైన్' స్నో మరియు టాల్క్ కలిపి కట్టబడిన ప్యాక్ కొనండి






బరోస్ వెల్కం & కంపెనీ (ఇండియా) ప్రయివేట్ లిమిటెడ్

# నేడే చూడండి!

స్త్రీలా! పురుషులా! ఎవరధికులు?
ఈ వరమ రహస్యాన్ని తెలుసుకోవాలంటే
ప్రతివారూ విధిగా చూసితీరవలసిన పరమాద్భుత
చిత్రం!..

యస్. ఆర్. మూవీస్ వారి

# ప్రమీలార్జునీయము

దర్శకుడు — నిర్మాతలు

యం. మల్లిఖార్జునరావు • ఆదిబాబు • నాగమణి




నైజాం: ఉషా పిలిమ్స్, సికింద్రాబాద్; మైసూరు: శారదా మూవీస్, బెంగుళూరు: నార్త్ & ఒరిస్సా: సరస్వతి పిక్చర్స్, బరంపురం.

ఆంధ్రసచిత్ర
వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 25—6—'65
విశ్వావసునామ సం॥ జ్యేష్ఠ బహుళ ఏకాదశి
సంపుటము 57 సంచిక 43

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

## చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28.60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.

## మనలో మాట

తెలుగు రచయితలు కొందరు మొన్ననే తిరుపతిలో సమావేశం అయినారన్న సంగతి అందరికీ తెలిసిందే. ఎన్నో అంశాలు చర్చకు వచ్చాయి. పలువురు ప్రసంగాలు చేశారు. ఆ సమాచారాన్నంతా స్థూలంగా 11వ పేజీనుంచి ఇవ్వగలిగాము...

* * *

లావోస్‌ను గురించిన వార్తలు పత్రికలు ఎక్కువగానే వేస్తుంటాయి. కాని, అక్కడి ప్రజాజీవనంగురించిన సంగతులు ఎక్కువగా వినే అవకాశంలేదు. ఆ లోటును పూరించటానికే 20వ పేజీలో వ్యాసం ఒకటి వేశాము.

* * *

వనితాలోకంలో యీవారం శ్రీమతి విశాఖగారు పాశ్చాత్య ప్రభావాలపై వ్రాశారు. మరి పాఠకులు ఏమంటారో?

* * *

'వేల్పులకైనా మార్పులు తప్పవు' శీర్షిక యీవారంతో అయిపోతున్నది. ఈ వ్యాసపరంపర ద్వారా ఎక్కువ వివరాలనే అందచేయగలిగామని అనుకొంటున్నాము.

* * *

'సరాగమాల' పేజీలో క్రొత్తపోటీ ఒకటి చూస్తారు. ఎక్కువమంది పాఠకులు పాల్గొనగలరని ఆశిస్తున్నాము.

* * *

శ్రీ జయకాంతన్ 'తమిళం'లో తీసిన సినిమా రాష్ట్రపతి గౌరవాన్ని అందుకొంది. ఆయన వ్రాసిన కథల తెలుగు అనువాదాలు కొన్ని లోగడ మా పత్రికలో వేశాము.

## విషయానుక్రమణిక



కొత్త సీరియల్ :
★
స్వాతి జల్లు
★
సి. ఆనందారామం
రచన
★
వచ్చేవారమే
ప్రారంభం

## ముఖచిత్రం

నా అభిమాన తార బి. సరోజాదేవిగారి ముఖచిత్రం ఈ వారం ఆంధ్ర సచిత్ర వారపత్రికకు ఎంతో వన్నె చేకూర్చింది.

మం. గోపాలకృష్ణమూర్తి. (జంషెడ్‌పూర్)

## వ్యాసాలు

11—6—65 అట్టమీద బొమ్మ మూవరు ఆకు కనువిందు చేస్తుంది. "పసిడిమనసులు"పసి మితో కనులు మిరుమిట్లు గొల్పుతున్నది.

ఆస్ట్రేలియాలో యుద్ధం జరిగితే. ఉపోగానం కిమంజసంగా వుంది. భయంకరమైన ఆ దృశ్యాలు యుద్ధం కోసం ప్రాకులాడే రణోన్మాదులకు కను విప్పు కల్గిస్తుంది. సామాన్య మానవుని హృదయాన్ని కలచివేస్తుంది. అందుకే పూజ్య మహాత్మాజీ శాంతి శాంతి అని విలపించేవారు.

ఆర్. వి. సీతా. (బళ్ళారి)

## భజరంగభళీ

అతి రమ్యము నీ కవితము
సతతము వర్ధిల్లుమయ్య సిరినందవదలన్,
అతివ నామ పాత్రుడవగు
'లతికా'! నీమధుర కవిత బహు లెస్సగురా!!

కంభంపాటి శ్రీరామ్మూర్తి. (విజయనగరం)

* * *

"వీనుల విందుగ వ్యాసమ్ముల
నేపాటియు కష్టపడక హేలగ రాసే
పావులరు వ్యాసకారుడు
"లతిక"కు నా కాంప్లిమెంట్సు భజరంగభళీ!"

అరణి అప్పారావు (విశాఖపట్నము)

## సీరియల్

ఈ వారంతో పూర్తయిన సాఫల్యం కథ మాకు చాల నచ్చింది. మేము ఈమధ్య ఇల్లాంటి కథ చదవలేదు. రచయిత భూపతిగార్కి, ప్రచురించిన మీకు నా అభినందనలు.

గరిమెళ్ళ సుభద్రాదేవి. (అంబాజీపేట)

* * *

"పసిడిమనసులు' సీరియల్ బాగుంది. ముందు ముందు యిలాగే వుండగలదని విశ్వసిస్తున్నాము. ముఖచిత్రం పత్రికకొక ఆకర్షణగా వుంది. రీటా హేవర్త్ ఆత్మకథ '"ప్రేమా పురుషులు నేను' కుతూహలమును కలుగజేస్తుంది. 'బావ' కథ బాగుంది.

పి. నరసింహచెట్టి. (కర్నూలు)

* * *

ఈ మధ్య మన వారపత్రిక చాల బావుంటోంది. హరికిషన్‌గారి "పసిడిమనసులు" ప్రారంభంలోనే చాల బాగున్నది. మన సినిమా పరిశ్రమ గురించేగాక హాలీవుడ్ తారలపై మీరు వేస్తున్న వ్యాసాలు మమ్మల్ని ఆనంద పరుస్తున్నాయి.

# ఉత్తరాలు

వైజ్ఞానిక గాథాశతి వంటి వ్యాసాలు పాఠకుల కందిస్తున్న మీకు ఎలా కృతజ్ఞత చెప్పాలో తెలియడములేదు ఇక ముందు కూడా ఇంకా సర్వాంగ సుందరంగా తయారవుందని ఆశిస్తున్నాను.

ఏకం గోవిందరావ్. (రాజమండ్రి)

* * *

హరికిషన్ రచనలు మాకు క్రొత్తకాదు. వారి సీరియల్ "పసిడి మనసులు" చదవ గలుగుతున్నందుకు ఎంతో ఆనందిస్తున్నాము.

సీరియల్‌లో మొదలు పెట్టిన జ్యోతి పాత్ర పరిచయం ఒక వెలితిని సూచిస్తోంది.

ఇది పెళ్ళిగ్రాములకు చేతులు వణికే కాలం కాదు. ఇవి సామాన్యులకు కూడా పరిపాటి అయి పాయి. ఆటువంటిది ఏ చీకూ చింత లేని ఒక కన్నెపిల్ల భయపడటానికి కారణంలేదు(శేఖరరు భయపడవచ్చు.. అది వేరే సంగతి) 'కవరు విప్పుతుంటే చేతులు వణికినాయి' అన్న సంఘటనద్వారా ఆ పాత్రలో తగినంత ధైర్యము లేదని తేల్చివేశారు.

అమితానందంతో శేఖరరు పైవుచూచి "నాకు నవలల పోటీలో మొదటి బహుమానం వచ్చిందండీ పదిహేను వందలు" అన్నది.

"అమ్మా ఫస్టుప్రైజా"

"నాకు మొదటి బహుమానం వచ్చిందే కమలా!" అన్న వాక్యాల ద్వారా ఆ పాత్రలో ఒక విశిష్టతగాని గంభీరతగాని లేదని స్పష్టమౌతోంది.

తనంతట తాను డప్పు వాయించు కొనటం ప్రఖ్యాత రచయితల మనస్తత్వమై ఉండదు.(?) హైగా క్లాసులో పాఠం జరుగుతుండగా బయట వరండాలో నుంచి హీరోయిన్ ఫోజులో ప్రైజు డబ్బు గురించి కేక వేయటం భావ్యంగాలేదు. ఈ సంఘటన పాత్రలోని జీవాన్ని నశింపజేస్తోంది.

అంత పెద్ద రచయిత్రికి చదువుయందు శ్రద్ధ వహించమని చెప్పిన తల్లిమాటలు అర్థంకాక విచ్చేర పోయిందని... అర్థం చేసుకో లేకపోయిందని అన్నారు. ఇది ఆమె గ్రహింపు శక్తికి, భావనా శక్తికి గీటురాయి.

రావం (బెంగుళూరు)

* * *

శ్రీ అవసరాల రామకృష్ణారావుగారు వ్రాసిన "సంపెంగలూ—సన్నజాజులూ" చాలా అద్భుతంగా ఉంది. కథకు తగిన పాత్రలూ, పాత్రలకు తగిన సంభాషణలు చాలా బాగున్నై. నవల నామ కరణం కూడా చాలా బాగుంది. కొత్త పోకడలతో, సవ్యభావాలతో, విశాల దృక్పథంతో చీకటి నుండి వెలుగులోకి పయనించే అందమైన పూలబాటలా ఉంది.

ఏది విలావున్నా పాఠకుల మనోనేత్రములలో కలకాలం నిలిచే ఒక చక్కని నవల ఇది! అందులో కథ ముగింపు నాకు ఎంతో ఆత్మ సంతృప్తిని ఆనందాన్ని కలిగించింది. రచయితకి అభినందనలు తెలుపుకుంటున్నాను.

జీలుగుల కృష్ణమూర్తి. (మిట్టపల్లి)

* * *

'సంపెంగలు సన్నజాజులు' సీరియల్ చాలా బావుంది. పూర్తవుతుందంటే కొద్దిగా నిరుత్సాహ పడ్డాము. అయినా ! మొత్తముమీద సీరియల్ చాలా బావుంది."

ఎస్. ఖజావా (ర్యాలి)

* * *

ఎంతో రసవత్తరంగా నడిచే శ్రీ అవసరాల రామకృష్ణారావు గారి "సంపెంగలూ సన్నజాజులూ" సీరియల్ అయిపోయిందనేసరికి ఎంతో నిరుత్సాహం కలిగింది. కాని వెంటనే హరికిషన్ గారి "పసిడిమనసులు" సీరియల్ ప్రారంభించి మా నిరుత్సాహాన్ని తొలగిస్తున్నందులకు మీకు నాధన్యవాదాలు.

అవసరాల శేషగిరిరావు (ఇలపకుర్రు)

* * *

మీర పత్రిక ద్వారా అందచేసిన 'సంపెంగలు సన్నజాజులు' అత్యంత రమ్యమైన గుబాళింపుతో ఈ సంవత్సరమంతా మమ్మానందింప చేయు చున్నది.

ప్రసాదరావుకు వచ్చిన రోగములు చాలా విచిత్రముగా మున్నవి.

పి. వి. యస్. నాగరాజ్, యస్. లక్ష్మీనారాయణ, కె. వి. శ్యాంసుందరం, ఆర్. సి. శేఖర్. (విజయవాడ)







కృష్ణమీనన్ బస్‌ను అందుకోలేక పోయారు!
అల్జీర్సుకు భారత ప్రతినిధి వర్గం




చెడును నిరోధించండి! మలేసియాని నిరోధించండి!
గాంధీ: ఇండోనేషియా దృక్పథం




పాకిస్తాన్, చైనాలకు నాజర్ హితబోధ!
మంచిమాటలు




రక్షణ చట్టం, అధికారాలు
నూనె కంపెనీలు

# సమైక్యతా సాధనకు తోడ్పని హిందీ...!

హిందీయేతర ప్రాంతాల్లో అంతగా దానికి స్థానం లేదనవచ్చు.

ఈ సమస్యను ఇంకొకవైపునుంచి ఆలోచిస్తే, శ్రీ మొరార్జీ దేశాయి హిందీ, ప్రొహిబిషన్ల విషయంలో రాజీకి రాని వాదంలోనే ఉన్నారు. హిందీ వాదనతో ఆయన దక్షిణాది వారిని త్రిప్పి వేశారు. హిందీ విషయంలోనే గుజరాత్ కాంగ్రెస్ లో ఆయన చీలికను సృష్టించారు. హిందీని బలపరుస్తూ ఆయన వ్యాసాల్ని వ్రాస్తున్నారు. అసలు ప్రశ్న పద్నాలుగు భాషల, త్రిభాషా విధానాన్ని ఆయన ఎందుకు ఒప్పుకున్నారన్నదే. ఇదంతా హిందీని దొడ్డిదారిన ప్రవేశపెట్టటమే.

ఇంతకుముందు చెప్పినట్లు ప్రాథమిక సమస్య యు. పి. ఎస్. సి. పరీక్షలు జరపటమూ కాదు, లేక యిప్పుడు వదిలివేయబడిన 'కోటా' పద్ధతి కాదు. అసలు సమస్య కేంద్రానికీ, రాష్ట్రానికీ మధ్య 'లింక్' భాష ఏదన్నదే! ఇంగ్లీషు నేర్చుకోవటం అన్నది ముఖ్యమైన వో భాషను నేర్చుకోడం క్రిందికి నెట్టివేయబడింది. హిందీ తప్పకుండా కేంద్రంలో అధికార భాష అవుతుంది. అందుకనే ప్రధాని శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి భాషా 'బిల్' లో ఇంగ్లీషును వ్యాపారానికి ఉపయోగపడే భాషగా కేంద్ర సచివాలయంలో ఉండటానికి నిరాకరించారు. చట్టాల్ని చేసే విషయంలో ఆ అధికారం శాస్త్రి గారికి యివ్వబడింది.

ఈ చట్టాన్ని రూపొందించే అధికారంవల్ల ఏర్పడే ప్రమాదాల్ని కొన్నిటిని వివరిస్తాము. అధికారవ్యవహారాలలో నడిచే ప్రతి కాగితంలోనూ అంతర్జాతీయ సంఖ్యలనే వాడాలని భారత రాజ్యాంగం నిర్దేశించింది. కానీ, అధ్యక్షునికి మాత్రం 1950—65 మధ్యకాలంలో సూచనలు చేయటానికి అధికారం ఉన్నది. కీ. శే. బాబూ రాజేంద్రప్రసాద్ తన అధికారాన్ని హిందీ సంఖ్యలను ప్రవేశపెట్టటానికి ఉపయోగించారు.

తర్వాత యిప్పుడు శాస్త్రిగారు, వారి అనుయాయులూ తగిన మానసిక స్థిరత్వాన్ని కలిగిఉండని పక్షంలో వాళ్లు 'లింక్' భాషగా ఇంగ్లీషుని ఒప్పుకుని ఉండేవారే.

దేశంలో సమైక్యతను కూడగట్టుకు రావటానికి హిందీ ఎలాగూ తోడ్పడదని తేలిపోయింది. అయినప్పటికీ హిందీవాదులే ఎక్కువగా ఉన్న కాంగ్రెస్ కార్యాచరణ సంఘం, ముఖ్యంగా ఐక్యత అవసరమనిపించే ఈ తరుణంలో కూడా హిందీని తప్పించటానికి బదులుగా దేశం యొక్క పరువు ప్రతిష్టలకే కళంకం తీసుకురావటానికి సిద్ధం కావటం విచారకరం.

* * *

అయితే ప్రశ్న యింకా ప్రశ్నగానే ఉంది. మొట్టమొదట అసలు లింక్ భాష ఏది ఉండాలి? రెండవది—ఇండియా ఫారెన్ సర్వీసెస్‌కి తీసుకునే అభ్యర్థుల్ని ఏ భాషలో పరీక్షించాలి? త్రిభాషా విధానంలో అన్నది ఒక సమాధానం. అదైనా యింతవరకూ హిందీయేతర ప్రాంతాల్ని సంతృప్తిపరచలేదు.

భారత రాజ్యాంగం 'ఫెడరేషన్ ఆఫ్ ఇండియా' ను రూపొందించింది. కేంద్ర విద్యామంత్రి శ్రీ చాగ్లా దాన్ని వో యూనియన్ అన్నారు. దానివల్ల కలిగే ఫలితాల కొరకు వేచి చూడాలి.

* * *

ఇండియా విదేశీ మారకం యిప్పుడు చాలా క్లిష్టదశలో ఉన్నది. దానికి తగిన చర్యలు తీసుకోవాలి. దిగుమతులన్నైనా, కొత్త దిగుమతి లైసెన్సులమీదా ఉన్న నిషేధాలను తీసివేయడం అవసరం. విదేశీ ఆఫీసుల్లో జరుగుతున్న దుబారాను కూడా దృష్టిలో ఉంచుకోవాలి. ఇండియా విదేశీ ఆఫీసర్లు కార్లు కొనే విధానాన్ని యిందుకు ఉదాహరణగా తీసుకోవచ్చు. మ్యాడ్రిడ్ లో ఉన్న ప్రతి విదేశీ సంఘం తన దేశం నుంచి కార్లను దిగుమతి చేసుకుంటుంది. విదేశాల్లో ఉన్న ఇండియా ఆఫీసర్లకు అక్కడ, వాళ్లు కార్లు కొనుక్కోటానికి అనుమతించి అందుకు కావలసిన విదేశీమారక ద్రవ్యాన్ని కూడా విడుదల చేస్తుంది భారత ప్రభుత్వం. మరల వాళ్లు ట్రాన్స్‌ఫర్ అయి ఢిల్లీకి వచ్చేటప్పుడు వాళ్లతో బాటే కార్లను కూడా తెచ్చుకోవచ్చు. రాయబార్లకు కూడా అలాంటి సౌకర్యమే 'ఎక్విప్‌మెంట్ గ్రాంట్' గా లభిస్తుంది.

అసలు ప్రశ్న ఈ పెద్దమనుష్యులంతా ఎందుకు కార్లను ఇండియా నుంచి దిగుమతి చేసికోరన్నదే! అలా దిగుమతి చేసికొన్నందువల్ల విదేశీ మారకద్రవ్యం బయటికి పోకుండా వుంటుంది.

ఇండియాలోతయారైన కార్లు దేశ గౌరవానికి సరితూగేలాలేవన్నది ఒక వాదన. కానీ దేశ గౌరవం కార్లమీద ఆధారపడి ఉంటుందా ?

ఇండియా దౌత్య వర్గాల్లో జరుగుతున్న క్రొత్త నియామకాల దృష్ట్యా ఈ సమస్యల్ని పరిష్కరించటానికి తీవ్రమైన ఆలోచన అత్యావశ్యకం.

—శ్రీకృష్ణ ★



"హౌసింగ్‌బోర్డుతో ఇల్లు కావాలా? ముందు మంత్రుల భార్యలకు [illegible]



"ఏమండోయ్! ఆ పళ్లడబ్బు పెట్టి [illegible]



"అబద్ధాలు చెప్పగలిగే వాళ్ళకే పాకిస్తాన్‌తో [illegible]"

# యువకులు ఫిలిప్స్‌ను అభిలషిస్తారు

యువకులు ఫిలిప్స్‌ను అభిలషిస్తారు...చురుకైన ఆటగాళ్లు, విద్యార్థులు...చాలమంది స్నేహితులుగల విలాసవంతులు...మంచి భవిష్యత్తును ఆశించే యశస్కాములు. ఒక్క మాటలో చెప్పాలంటే మీవంటి యువకులు...

ఫిలిప్స్ ఎందుకు? వాళ్ళే అంటారు మీతో. ఫిలిప్స్ దిట్టంగా వుంటుంది. (ఇది అసలైన టెంపర్ ఉక్కుతో తయారైంది). ఎంత చెడతొక్కినా తట్టుకోడానికి వీలుగా ఉంటుంది. ఇంకా ఫిలిప్స్ అందంగా ఉంటుంది. దీని స్నిగ్ధత, గంభీరత సంస్కృతిని ప్రతిబింబిస్తాయి. విశిష్టకరమైన బైక్. మొత్తంమీద నేటి చురుకైన యువకులకు ప్రత్యేకంగా విధాయింపబడినది.





In a man's world
MONARCH
LUXURY TALC
FOR MEN
J.K. Helene Curtis

# అనురాగ లత



యల్. కిరణ్ కుమార్

అనురాగం, లత జీవితం, ఈ రెంటిలో ఏదో సామ్యం కన్పిస్తుంది వృద్ధిక్షయాలు ఈ రెంటికీ ఒకటే. వసంతంలో అందంగా, ఆనందంగా విర వీగే లత గ్రీష్మం వచ్చేటప్పటికి చప్పగా చల్లారి పోతుంది. వసంతంలోనైనా అతి కోమలంగా పెంచితేనే అది వికసించి పుష్పిస్తుంది, లేకపోతే నశిస్తుంది. అనురాగం కూడా అంతే రోజుకు రేయింబవళ్ళలానూ, మానవజీవితానికి వెలుగు, నీడ లలాను.

పై విషయాన్ని నిరూపించే నాకు తెలిసిన వో యింజనీరు జీవితాన్ని మీముందుంచాలని యత్నిస్తున్నా.

* * *

"ఏమండోయ్ ! ఈవేళటి ప్రోగ్రామ్ విషయం మర్చిపోయారా ?" తన అందమైన కళ్లను మరింత అందంగా త్రిప్పిం దామె. ఆమె పేరు భారతి.

"ఊహుఁ, నేను రాను" తన కర్కశానికి తనే ఆశ్చర్యపోతూ అన్నాడతడు.

అతడు అంటే హరి. కంపెనీ క్వార్టర్సులో ఉండ వలసి వస్తే తిరిగి నల్గురిలో మెలగవలసి వస్తుం దని, వంటరితనాన్నాసించి, వాంఛించి వూరికి దూరంగా వో యింటి నద్దెకి తీసుకున్నాడు. భారతి ఆ యింటి యజమాని ఏకైకపుత్రిక అందంలో రతీదేవంతటిది అనకపోతే నిజంగా దెబ్బలాట కొస్తుందేమోననే భయం లేకపోలేదు. సంక్రాంతి సెలవలకు యింటికొచ్చింది కాన్వెంటునుంచి వచ్చిన రెండు రోజులకే హరి నాకట్టుకొంది అందు కామె అందమే కేవలం కారణం కాదనుకుంటా. నిర్మలి మైనది ఆమె హృదయమని చెప్పవచ్చు అందానికి ప్రాముఖ్యత ఖ్యాయని హరిలాంటివాడిమె

స్నేహాన్ని కోరుకున్నాండటే అదే కారణం కావచ్చు.

"ఈవేళ పార్కుకు వస్తానన్నారుగా. రెండు రోజులలో నేను తిరిగి కాలేజీకి పోవాలి కదండీ. ఈవేళ దయఉంచి మీ గురించి అంతా చెప్పే యాలి. ఇంక వాయిదాలు వేయరుగా" ప్రతి మాలుతూ అడిగిందామె.

ఇటువంటి వాటికి లొంగేవాడు కాకపోయినా, ఆమెను నొప్పించటాన్కి యిష్టంలేకనో, వాయిదాలు వేయడం యిష్టంలేకనో మెకానికల్‌గా ఆమె ననుసరించాడు, మెకానికల్ యింజనీరు హరి.

హరి తాతా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీలో యింజనీర్‌గా ప్రవేశించి ఇంకా ఒక్క సంవత్సరమైనా కాకపోయినా, అతని సిన్సియారిటీని అతని తెలివితేటలను చూసి, కంపెనీవాళ్లు ఫారిన్ పంపుదా మనుకోవడం మాత్రం నిజం. హరి తన ఎం. ఇ రెండవ సంవత్సరము చదువుతూ మానివేసాడు ఎందుకు మానివేశాడు అంటే ఎవరికీ తెలియదు అతను ఫారిన్ ఛాన్సు కూడా తిరస్కరించటాన్కి సిద్ధంగా ఉన్నాడు. ఏం ? అనడిగితే ఎవరికోసమని తిరిగి ప్రశ్నిస్తాడు ? కాని జవాబియడు

ఎవరికీ తెలియని ఈవిషయాలనే ఆమె తెల్సుకో గోరుతున్నది హరి బయలు దేరే ముందు జేబులో పెట్టుకొన్న డైరీని మరోసారి తడుము కున్నాడు

పార్కులో మెత్తని గడ్డిమీద కూర్చున్నాక—

"ఏమండీ?" ఎంతో తీయగా మాట్లాడిందామె.

"ఏం?"కర్కశమైన జవాబు.

"నేనంటే మీకిష్టమేనా?" అందమైన ఆమె బుగ్గలు అరుణ వర్ణం దాల్చాయి.

"అలాంటి పిచ్చి ప్రశ్నలంటే నాకు పిచ్చికోపం". అతని సమాధానం

ఈసారి ఆమెకు నిజంగా కోపం వచ్చింది. కాని అడదానికి ఆజ్ఞాపించే వాడి మీదున్న యిష్టం అను సరించే వాడి మీదుండదనే విషయమే అనుకుంటూ ఆమె కతని మీద యిష్టాన్ని ఎక్కువ చేసింది

"మీ గురించి ఈవేళ చెబుతానన్నారుగా? మీరు ఎమ్ ఇ చదువుతూ ఎందుకు మానివేశారో చెప్పరూ?" ఎందుకో ఆమె కతని గురించి తెలుసు కోవాలనే అభిలాష.

"ఎందుకా పాత విషయాలు. అనవసరంగా అవన్నీ జ్ఞాపకం తెచ్చుకోవడం నాకంత యిష్టం లేదు." తనబాధ మరొకరితో చెప్పుకుంటే వుపశమిస్తుందనే ఆశ అతని మాటల్లో తొంగి చూస్తుంది

"ప్లీజ్! మీ గురించి నాకెందుకో తెలుసు కోవాలని అభిలాషగా వుంది దయవుంచి చెప్పరూ?" గోముగా అడిగిందామె అతనివైపేచూస్తూ.

"మరి నీవు నావైపట్లా చూడొద్దని చాలా సార్లు చెప్పాను". ఆడవాళ్ల హృదయాలతో నేనాడు కోలేను అనేది ధ్వనిస్తుందా మాటలో.

"సర్లెండి, యింక మొదలు పెట్టరూ" పైకి చూడ లేక, గడ్డిని చేతితో త్రుంచుతూ అడిగిందామె.

* * *

అది నేను బి.ఇ. ఆఖరి సంవత్సరము చదివే రోజులు. అన్నయ్య రమ్మంటే వాళ్ళ వూరెళ్ళాను వేసవి శెలవలకు. అన్నయ్య కాకినాడలో అర్.డి.ఒ. గా పనిచేస్తున్నాడు. మావదిన దేవత లాంటిది. ఆరోజు అన్నయ్య క్యాంపుకు వెళ్లాడు. ఎవరో అమ్మాయితో వదిన మాట్లాడుతుంది. ఆ అమ్మాయి మాటలను వినటాన్కి ఉపక్రమించా, నిద్ర పోతున్నట్టు నటిస్తూ, అది తప్పని తెలిసినా.

వాళ్ల మాటలనుబట్టి ఆ అమ్మాయి పేరు అరుణ అని, ఆమెకు వదిన అక్కవరస అవుతుందని, నాగురించామె చాలా అడిగి తెల్సుకున్నదని గ్రహించా. చూడ బుద్ధివేసింది. చూసా. కాని, నావైపే చూస్తున్న ఆమె వాడియైన చూపులను, నా చూపులను ఢీకొన్నాయి. కొన్ని నిముషాలు గడిచాయి ఎంత అందమైన దీమె అనుకున్నాను! అయినా చిన్నప్పటినుంచీ అందానికి ప్రాముఖ్యత యీయని నే నామెను చూడగానే అందంగా ఉందీమె అన బుద్ధివేసింది. మరునాడు వదిన ఆమెను పరిచయం చేసింది. మా నిన్నటి పరిచయం తెలియక కాబోలు. వదిన చాలా మంచిదనుకున్నా మరోమారు. ఆమెతో తొలి పరిచయంనాడు మాట్లాడిన మాటలు మా జీవితాలని మార్చివేశాయి ఎందుకో నాకామెతో యింకా మాట్లాడా లనిపించేది.

చిన్న చిన్న చిటీలతో ఆరంభమైన మా స్నేహం నీవే బందిపోటు దొంగవు, నా హృదయాన్ని దోచు కున్నావు అంటే "మీరే" అనే వరకు వచ్చింది

"నేను నిద్రపోయేటప్పుడు అంటే నా హృదయము నా దగ్గిర లేనప్పుడు నీవే వచ్చి దొంగిలించే శావు" అని ఏడ్పించేవాడ్ని. బుంగమూతి పెట్టిన ఆమె మోము నాకు మరీ మరీ చూడాలన్పించేది

ప్రతిరోజు సర్దాగా గడిచిపోయేది. ఒకరి కళ్లలోకి ఒకరం చూసుకుంటూ గడిపేసేవాళ్లం హాయిగా రోజుల్ని. రోజు అరుణ మా యింటికి వచ్చేది. అన్నయ్య ఆఫీసులో ఉండేవాడు. వదిన మాతో సహకరించేది మాయింటి దగ్గరలోనే ఒక పార్కుంది. ఓరోజు పార్కులో ఉన్నాం మేమిద్దరం. అన్నయ్య ఆ దారినే ఇంటికి వెడుతూ చూశాడు నాకు భయమేసింది కాని అన్నయ్య నవ్వుతూ "విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్" అన్నట్టుచూసి వెళ్లిపోయాడు. బ్రతుకుజీవుడా అన్నట్టున్న నన్ను చూసి అరుణ అందంగా నవ్వింది. ఆరోజు నే నెంతగా సంతోషించానో నాకే తెలియదు

మరోరోజున మా రిజల్ట్సు వచ్చాయి. మంచి మార్కులతో పాసయిన నన్ను అన్నయ్య అభినందించాడు. వదిన అది అరుణ అదృష్టం అంది అన్నయ్య నవ్వుతున్నాడు. వదినమీద చిరుకోపం కూడా ప్రదర్శించలేకపోయా. అన్నయ్య ముందు ఎందుకో సిగ్గు. అది సిగ్గో, భయమో

"పో వదినా! నువ్వు మరీను" అమ్మాయికన్నా ఎక్కువ సిగ్గుపడిపోయా అన్నయ్య ఎం ఇ. చదవమని ఆర్డరు జారీచేశాడు వదిన ముందు పెళ్లిచేసేయాలంది. నాకు రెండూ బాగానే ఉన్న ట్టనిపించాయి. కాని ఎం. ఇ చదవడానికే నిశ్చ యించుకున్నా. అన్నయ్య లేరనుకుని వస్తున్న అరుణ అన్నయ్యను చూసి గతుక్కుమంది.

"రా అరుణా! వో ఐ సీ! మీకేదైనా ప్రోగ్రాం ఉందనుకుంటా. మరిచిపోయా, మీ హరి ఫస్టు క్లాసులో పాసయాడు" ఇంక నా పని అయిపోయిం దన్నట్టు, నావైపు చూసాడు. అన్నయ్య ముందేమీ మాట్లాడలేకపోయా. ఆవేళ ఏదో సినిమాకు వెళ్లాం. "నాకు ట్రేజిడీలంటే బలే భయం బాబు" అంది. నాకు చాలా యిష్టం అన్నా. ఆఖరికి వో ట్రాజిడీ సినిమాయే చూసాం.

ఎం. ఇ. అడ్మిషను పడేసా. శెలవలు హాయిగా గడిచిపోయాయి. కథలలోను, సినిమాలలోను ప్రేమించుకోవడం చాలా తేలిక, నిజ జీవితంలో అది చాలా కష్టం అనే మా రూమ్‌మేట్‌తో ఏకీభవించే వాడ్ని ఒకప్పుడు. కాని నా కప్పుడు సమంజసంగా తోచడంలేదు. ఏ డ్యూయట్లు, ఏ లవ్ సీన్లు లేకుండానే మేము మరింత సన్నిహితుల మయాం.

వదినా అన్నయ్యలు ప్రోత్సాహ మిచ్చారు. అమ్మా నాన్నలు బలపర్చారు. ఇక అడ్డులేని మా ప్రేమ కలాపాలు నిర్విఘ్నంగా కొనసాగించాం నా ఎం. ఇ. మొదటి సంవత్సరంలో—అందం, డబ్బు ఉన్నవారికి అహం ఉంటుం దంటారు. కాని యిది అరుణకు చెందదు. నిష్కల్మషమైన ఆమె హృదయం నన్ను చేరువకు తీసుకుంది. మాకు పెళ్లిసంబంధం నిశ్చయమైనదని తెలియగానే 'ఎంత సంతోషిం చానో చెప్పలేను ఆ సంతోషంలో రూమ్‌మేట్ 'ఈశు' ని ముద్దు పెట్టేసుకున్నా. ఎప్పుడైనా దారి తప్పనున్న, నన్నతడు మందలించేవాడు రక్త సంబంధీకులైన తమ్ముళు లేని నా కతడు తమ్ము డయాడు జాగ్రత్తగా చదవమని హెచ్చరించాడు. అది నా రెండవ సంవత్సరము.

"ఓ సంఘటన నా కిక్కడ చెప్పాలని ఉంది. వింటున్నారా ? లేక బోరుకొడుతున్నదా ?"

"ఆఁ లేదు. ఫరవాలేదు చాలా ఇంటరెస్టింగా ఉంది. చెప్పండి" అంటూ శ్రద్ధగా వింటున్న ఆమె కంగారుపడింది

"అయితే మీ కర్మ వినండి" అనుకుంటూ తిరిగి మొదలుపెట్టాడు హరి

"అవి మా సంక్రాంతి సెలవలు. ప్రతీ సెలవలకు అన్నయ్య దగ్గరికే వెళ్లేవాడినని మీకు చెప్ప నవసరంలేదనుకుంటా. ఇంతకుముందు ఎప్పుడు వచ్చినా కన్పించే అరుణ నా కిప్పుడు కన్పించటం లేదు. ఎందుకు కన్పించనట్టూ ? అని ప్రశ్నించు కొని, పెళ్లి నిశ్చయమైనదని సిగ్గు కాబోలు అని సర్దు చెప్పుకునేవాడ్ని

"ఆరోజు ఎందుకో వాళ్ల ఇళ్లు దాటేసి వచ్చిన తరువాత వెనుకకు తిరిగిచూసా హఠాత్తుగా మేడ మీద తలుపుచాటునుంచి నన్ను చూస్తున్న అందమైన అరుణ నాకు కన్పించింది "అమ్మ దొంగా! నీ పని యిట్లా ఉందా? అగు నీపని చెప్తా" అన్నట్టు చూశా. ఏదో వూహ కల్గింది అలాంటి వూహలు కల్గాలే కాని ఆచరణలో పెట్టటం చాలా తేలిక. తిరిగి కాలేజీకి వెళ్లిపోయా. ఇప్పటినుంచే మొదలు పెట్టాలి అని మొదలెట్టా వో మంచిరోజు చూసు కుని

"మా వివాహం ఆ వేసవిలోనే అందుకని మేం నిరభ్యంతరముగా లెటర్సు వ్రాసుకొనేవాళ్లం

"ఇక నే చెప్పలేను. దయవుంచి ఈ లెటర్సు చదువు" అంటూ డైరీలోంచి 4 లెటర్సు తీసి యిచ్చాడు.

భారతి చదవడం ప్రారంభించింది.

ఫిబ్రవరి—14—63,

ప్రియమైన అరుణకు, బెంగుళూరు.

హరి దీవెనలతో వ్రాయునది. నీకో ముఖ్య విషయం చెప్పాలని ఉంది. మేము ఎక్కే బస్ స్టాపు ముందు వో అరడజను మంది అమ్మాయిలు ఎక్కు తుంటారు. అందులో రజి అనే అమ్మాయి నన్నాకర్షించింది. ఒకరోజున మేమంతా తిరిగి వస్తున్నాం కాలేజీనుంచి. అంటే వాళ్ళు కూడా ఉన్నారన్న

# ఆధునిక క్రొత్త టూత్ పేస్టు




# హెక్సాక్లోరోఫిన్ చేర్చినది

దంతాల ఆరోగ్యాన్ని ఎల్లప్పుడూ కాపాడుటకు అవసరమైనది ఎపిక్. హెక్సాక్లోరోఫిన్ కలసిన ఎపిక్ టూత్ పేస్టు యొక్క నురుగ బక్టీరియా క్రిములను నాశనముచేసి పళ్లను తెల్లగా శుభ్రపరుచును. రోజంతా నోరు సువాసనగాను చల్లగాను వుంచుటకు ఎపిక్ టూత్ పేస్టు ఉపయోగించండి.

**తెల్లని ఎపిక్ టూత్ పేస్టు పళ్లను తెల్లపర్చి నోటి దుర్వాసన పోగొట్టును**




ఓరియెంట్ ఫార్మ ప్రైవేటు లిమిటెడ్, మద్రాసు 43

ajanta OP.E/64-2-A-TG

# అనురాగలత

కూడా. వాళ్ళ స్టేషన్ రాగానే, వాళ్ళకంటే ముందే మేము అంటే ఈశు, నేను దిగి వాళ్ళని ముందు పోనిచ్చి, మేం వెనకపడ్డాం. నే చెప్పిన అమ్మాయి ఒక ఇంటిలోనికి వెళ్ళి, ఎవరో అబ్బాయికి చీటి యిచ్చి మావద్దకు పంపింది. ఆశ్చర్యపోయాం. అంద మైన అమ్మాయి దగ్గరనుంచి కాఫీకి ఆహ్వానం. "కాఫీకో, దేనికో బాబు, నేను రాను" అంటూ ఈశు వెళ్ళిపోయాడు. నేను "ధైర్యే సాహసే లక్ష్మీ" అనుకుంటూ ఆ కుర్రాడి వెనకాలే వెళ్ళా. రజీ వాళ్ల నాన్నగారికి నన్ను పరిచయం చేసింది. నేను, తన ముఖ్య స్నేహితుడ్నంటూ. రిటైర్డు డి. ఎస్. పి అయినవాళ్ల నాన్నగార్ని చూసి, భయపడుతున్న గుండె కుదుటపడింది. నా గురించే ఎన్నెన్నో గొప్పలు చెప్పేసింది. ఈమె కిన్ని విషయాలు నాగురించి ఎలా తెలుసా ! అని ఆశ్చర్యపోవటం నా వంతయింది. వాళ్ల యిల్లు, ముఖ్యంగా రజీ గది, రజీకన్నా అందంగా ఉందనుకో. రజీకి యిద్దరు తమ్ముళ్ళు. తండ్రే తల్లిదండ్రుల పోస్టులు నిర్వర్తిస్తున్నాడు

మిగిలినవి మరోమారు. నీ ప్రియమైన,

హరి

మొదటి ఉత్తరాన్ని మడిచి రెండవదాన్ని చదవ టాన్కి ఉపక్రమించిం దామె

మార్చి—1—63,

ప్రియమైన అరుణకు, బెంగుళూరు

హరి ప్రేమతో వ్రాయునది. రజీ వాళ్ల యింటికి తిరిగి వెళ్లకూడ దనుకున్నా. అంటే నా గురించి దాయాదులను సహితం దూరంచేసుకుంటున్న నిన్ను మోసం చేయకూడ దనుకున్నా. కాని రజీ నౌఖరు మా రూము కొచ్చాడు. "అమ్మగారు అలి గారు. భోంచేయటంలేదు. బాబుగారు మిమ్మ తీసుకురమ్మన్నారు" అన్నాడు. అది రెండవరోజట ఆమె అలిగి. బహుశా ఆమె వ్రాసిన "లోకల్—లెటర్సు" కు నేను జవాబీయలేదని కాబోలు. మధ్యాహ్నము కాలేజీ మానేసి వాళ్ల యింటికి వెళ్లా. అందంగా ఉండే రజీ ముఖం, కళా విహీనంగా ఉంది. ఎంత బాధపడ్డానో, అనవసరంగా ఆమెను ఏడిపించినందుకు. అలకకు కారణం నేను జవా బీయలేదనేనట. ఆమె నా కిస్తున్న విలువకు ముగ్ధుడ నయాను. సినిమాకు పోదాం అంది ఆ క్షణంలో ఆమెను బాధపెట్టటం యిష్టంలేక, ఆమె ఆజ్ఞలను పాటించటం నావంతయింది రెండవ రిక్షాను పిలుస్తున్న నన్ను వారించింది ఇంగ్లీషు సినిమాకు వెళ్దాం అంది. "లవర్స్ మస్ట్ లెర్న్" చూశాం. మరలా ఒకే రిక్షాలో వాళ్ల ఇంటికి వెళ్లాం వాళ్ల యింటివద్దనే భోజనంచేసి ఇంటికి వెళ్లిపోయేటప్పుడు చచ్చినా యిక వీళ్లింటికి రాకూడదు అనుకున్నా.

అరుణా ! నీ కసూయగా లేదూ ? నీకు నిశ్చయ మైన నేను, నీ పరోక్షంలో మరో అమ్మాయితో తిరుగుతుంటే నిన్ను నేను మోసం చేయనులే నిజంగా మోసంచేసే ఉద్దేశ్యమే కనుక ఉంటే నీకీ విషయాలు చెప్పనుగా. నమ్ముతావుగదూ నీ హరిని. నీ ప్రియమైన,

హరి

పూర్తిగా చదివిన ఆమెనుంచి ఆ ఉత్తరాన్ని తీసుకొని మరోటి యిచ్చాడు. ఆమె చదువుతుంది అత నామెనే చూస్తున్నాడు, ఆమె భావాలను చదవ టాన్కి.

మార్చి—15—63,

ప్రియమైన అరుణకు, బెంగుళూరు.

ఏ ఇంటికైతే తిరిగి వెళకూడ దనుకున్నానో ఆ యింటికే తిరిగి వెళ్లవలసి వచ్చింది. తీవ్ర జ్వరంతో బాధపడుతూ నీ హరికోసం కలవరిస్తున్న రజీ యింటికి వెళ్లా, ఆమెను రక్షించటానికై పిచ్చిగా ఆమె కోరిన కోర్కెను కాదనలేకపోయా. నా పంతంకన్నా ఆమె ప్రాణమే ముఖ్యమని గ్రహించా. నే నిప్పుడు "ఈశు" తో లేను. రజీ వాళ్ల ఇంటిలో ఉన్నా. నా ముఖ్య స్నేహితులలో రజీ ఒకరు యిప్పుడు రెజీ మామూలు మనిషైంది. త్వరలో "ఈశు" దగ్గరకు వెళ్లిపోతా. నీవు జాగ్రత్తగా చదువుతున్నావు కదూ ! ఈ సంవత్స త్సరము మీకు గ్రూపు ఒక్కటేగా. మరి పూర్తిగా ప్యాసుకావాలి. ఇంజనీరు భార్యకు ఆమాత్రం బి.ఎస్ సి డిగ్రీ అయినా లేకపోతే ఎట్లా జాగ్రత్తగా చదువు. మరొకరికి కాలేని నీ,

హరి

"ఇదే ఆఖరి ఉత్తరం" అంటూ యిచ్చిన ఆ ఉత్త

పెద్దమనిషి : (డాక్టరు గారితో) రెండు రోజుల్నుంచి నా గుండె చాలా వేగంగా కొట్టుకుంటూవుందండి.

డాక్టరు : అయితే వుండండి. ఆగి పోయేందుకు మందైన మం దిస్తాను.

యస్. వి యస్. రెడ్డి (హైదరాబాద్)

రాన్ని చదువుతుందామె. అతను ఆమెనే చూస్తు న్నాడు.

మార్చి—30—63,

అరుణా ! బెంగుళూరు.

నిన్ను ప్రియమైన అని సంబోధించటాన్కి కూడా లేను తగను క్షమిస్తానంటే ఓ విషయం చెప్పాలని ఉంది. అరుణ నన్ను క్షమిస్తుంది. నేను నీకు తగను నీ అంత మంచివాణ్ని కాను నేను నేను స్వలాభిని. స్వార్థపరుడ్ని. నేను రజీ త్వరలో వివాహం చేసుకోబోతున్నాం. వాళ్ల నాన్న, నన్ను అమెరికా పంపుతా నన్నారు. మరో జన్మలో నైనా మన కోర్కె ఫలిస్తుందని ఆశిద్దాం. నీ కాలేని,

హరి.

తరువాత హరి చెబుతున్నాడు ఆమె వింటున్నది. నా మొదటి మూ డుత్తరాలకు జవాబు రాలేదు కాని, ఆఖరిదానికి మాత్రం వెంటనే జవా బొచ్చింది. జవాబుగా వచ్చిన అన్నయ్య తనతో రమ్మన్నాడు. అరుణకు సీరియస్‌గా ఉందట. అన్నయ్యతో ఏమీ మాట్లాడలేకపోయా. అరు ణను చూడటాన్కి ఆతృతపడుతున్న నన్నర్థం చేసుకున్నట్టుగా, రైలు దిగగానే హాస్పిటలుకు తీసుకెళ్లాడు అన్నయ్య. అరుణ బెడ్‌పై కూర్చున్నా. అప్పుడే స్మారకంలోంచి తేరుకున్న ఆమె నా కుడి వ్రేళ్ల తన సున్నమైన లేడు పాలిపోయిన బుగ్గలకు వ్రాసుకుంటూ ఏదో గొణుగుతోంది నా కర్థం కాలేదు. నాలో దుఃఖం పెల్లుబికి వస్తుంది ఆమె అధరాలను, పరిసరాలను గుర్తించకుండా ముద్దిడా

కాని అవి జీవంలేని అధరాలు. ఆమె జీవం లప్పటికే అనంతవాయువులో కల్సిపోయింది

పిచ్చిగా ఎవరితోనూ మాట్లాడలేక కాలేజీ చేరు కున్నా. ఏదో కవరొచ్చిందని, రూమ్—మేట్ నా కిచ్చిపోయాడు.

అది, లేని నా అరుణ నుండి వచ్చింది. అందులో నా ఉత్తరాలలోపాటు ఓ కాగితం ఉంది అందులో అరుణ వ్రాసినవి—

ప్రియమైన హరికి,

ఎప్పటికైనా మీరు నాకు ప్రియమైనవారే. మీ ఉత్తరాలన్నీ అందాయి. ఏమని జవాబివ్వాలో తెలియక ఈయలేదు. ఆడది ఒక్కరికే మనసీయ గలదు నేను మనసారా మిమ్మలనే ప్రేమించా. మీరులేని ఈ జీవితాన్ని భరించలేను మరో జన్మలో నైనా కలుద్దాం అని వ్రాశారుగా. ఆ కలతో ఆలశ్యాన్ని భరించలేక ఈ జీవితంనుంచి నిష్క్ర మించదలుచుకున్నా.

అరుణ

అదే నా జీవితంలో తొలి షాక్. ఉత్తరం చదివి కుప్పగా కూలిపోయిన నన్ను ఈశు వారించాడు. "నీవేం హంతకుడవు కావు నీకేం శిక్ష విధించవీ చట్టాలు" అనేవాడు. నేనే, హంతకుడనంటున్నా. ఆ సంవత్సరము చదువు కూడా అయిపోవచ్చింది. "జాగ్రత్తగా చదువు రెండు నెలలలో పరీక్ష లొచ్చేస్తున్నాయి" అని అనేవా డతను. కాని చదువు మీదే కాదు, జీవితంమీద కూడా విరక్తికల్గింది. కాని, నన్నింత కష్టపడి చదివించిన తల్లిదండ్రు లను మోసం చేయలేను. ఈ జీవితం నుంచి నిష్క్రమించలేను. అరుణంత ధైర్యం నాకు లేదు. నేను అరుణకు దేనిలో కూడా సరికాను అదే నా చదువుకు ఆఖరు.

అరుణతో నా హృదయమంతా నిండిపోయింది. మరొకరి కందులో ఖాళీ లేదేమో. అందుకే అన్నయ్య బలవంతం పెట్టటంలేదు పెళ్ళి చేసుకోమని అని ముగించాడు ఆఖరి ఈ మాట లామె కర్థంకాలేదు

కన్నీళ్లతో నిండిన అతని కనులను చూడలేక, తన కొస్తున్న కన్నీటి నాపుకుంటూ అడిగిందామె.

"మరి రజీతో మీ వివాహం జరగలేదా ?"

అతను విషాదంగా నవ్వుతూ "అసలు రజీ అన్న అమ్మాయి ఈ లోకంలో ఉందో లేదో తెలి యదు నాకు ఉన్నా నాకు ఫ్రెండ్ మాత్రం కాదు. తీవ్ర జ్వరంతో బాధపడుతూ, నాకోసం పరితపించే యువతి అసలే కాదు. అదంతా నేను కల్పించిన కల్పన. అరుణను ఏప్రిల్‌ఫూల్‌చేద్దామని వ్రాసిన ఉత్తరాలవి. అంతే ఇంకేమీ కాదు" ఇద్దరూ లేచారు

"తీగలు తెగేవరకు సాగదియ్యడం వివేకం కాదు. అనురాగలత ఎంత సుకుమారమో, అంత కఠినం. ఎంత సున్నితమో అంత ప్రగాఢం. అతి కోమలంగా పెంచితేనే అది వికసించి పుష్పిస్తుంది" ఏదో కథ లోని మాటలు గుర్తొచ్చి అనుకుంటూ అతడు గొణుక్కుంటున్నాడు.






# లాక్టో-కేలమైన్

## వాడితే మీరు కూడా అందంగా కనుపిస్తారు.

**అది సౌందర్య పోషణకు మించినది కావడమే కారణం.
చర్మంలోని లోపాలను అది సరిదిద్దుతుంది.**




చర్మానికి మేలు చేసేవి కేలమైన్, విచ్ హాజెల్. ఈ రెండూ చేర్చినట్టిది లాక్టో-కేలమైన్. కాగా ఇది మీకు సహజసిద్ధమైన ఛాయనిస్తుంది. చర్మంలోని లోపాలను సరిదిద్దడమే గాక, వాటిని కనుపించకుండా కప్పి వేస్తుంది. పౌడర్ అద్దుకొనే ముందు రాసుకోడానికి ఉత్తమమైనది. మీ చర్మంలో కలిసిపోయి, చర్మానికి మృదుత్వం చేకూర్చి మెరిసేటట్టు చేస్తుంది. ఎండవేడిమికి చర్మం పెట్లినా, బొబ్బలు పుట్టినా వాటిపై రుద్దితే శీతలపరిచి హాయి చేకూర్చ గలదు. చర్మంలోని లోపాలను పోగొట్టి వాటిని పూర్తిగా కప్పిపుచ్చే సౌందర్య పోషకం లాక్టో-కేలమైన్ ఒక్కటే. ప్రతి రోజూ వాడకానికి అనువుగా తేలికగాను, అందంగాను వుంటుంది.

క్రూక్స్

**లాక్టో-కేలమైన్** వాడి సహజ సౌందర్యవంతులు కండి.

[లాక్టో-కేలమైన్ రేంజిలో వున్నవి మరికొన్ని : క్రీమ్-టాల్క్]




"ఇవాళ మంగళవారమట కొత్త చాపు ఇవాళ ఉత్తరించ వద్దన్నారు మీ అమ్మ."

"అన్నా! చాకలి బట్టలు తేలేదు. మరి ఎలాగ మినిస్టరుగారి దగ్గరకు వెళ్లడమూ ?"

"ఇవాళ 11 30 కి వర్జ్యముంది. వర్జ్యము దాటిపోయేదాకా బయల్దేరవద్దను రాధమ్మా అన్నారు మీ నాన్నగారు."

"సరిపోయింది రాకరాక ఆయన వస్తే అవకాశము దొరకబుచ్చుకుని చూశేయాలి కాని, వారాలూ, వర్జ్యాలూ చూస్తే పను లెలాగౌతాయీ ?"

"వారమూ వర్జ్యమూ చూడకపోతే పనులు అవవనే వారు వద్దన్నది."

"ఇంట్లో కూర్చుని యత్నమే చెయ్యకపోతే అయిపోతాయా పనులూ ?"

"మీతో వాదించగలనా నేను ? వారు వద్దన్నారని చెప్పడమే నాకు చేతనౌను."

"సరే. వెళ్ళు చెప్పేవుగా ?".... వెళ్ళిపోయింది రాధ! విన్న తొడుక్కున్న బట్టలే వేసుకుని, పుస్తకాలూ దరఖాస్తూ పట్టుకుని వెళ్లాను. వర్జ్యమనే కాబోలు ఎవరూ మినిస్టరుగారిని చూడడానికి రాలేదు ఒక అరవాయన మాత్రమున్నారు. వారికి రాహుకాలపు గొడవేగాని వర్జ్యాల బాధ లేదుకదా! అందువల్లనే కాబోలు ఆయన ఉన్నారనుకున్నాను నన్ను చూచి ఆయన చేటంత ముఖం చేసుకుని, 'లోపలికి వెళ్లండి' అన్నట్లు చెయ్యూపేరు ఎవరూ ఆయన్ని చూడకముసుపే తానెందుకు చూడాలి అని కాబోలు నేను కోరినది ముందే లభ్యమైంది 'రక్షించావు భగవంతుడా' అనుకుని వెళ్లి చూచి, చెప్పి, వచ్చేశాను

ఇంటికి రాగానే అడిగింది అమ్మ 'మంగళవారం పూటా కొత్త పంచల చాపు ఉత్తరించావనుకున్నాను పాత పంచే కట్టుకువెళ్లావా ?' అని. 'నువ్వు ఉత్తరించవద్దన్నావట కాదూ' అన్నాను నాన్నగారన్నారు "వర్జ్యంవేళ ఎందుకు వెళ్లావూ ?" అని "అసలు చూడకపోడము కన్న చూచి రావడము మంచిది కదా అని" అన్నాను.

గదిలోనికి వెళ్లి పంచమార్చి, షర్టు తీసేస్తుంటే అంది రాధ "ఏమన్నారూ ?" అని

"పాత బట్టలే వేసుకు వచ్చేవేం ? అని అడుగలేదు"

"మీరు వెళ్లిన పనిని గురించి—"

"దానిని గురించి, ఎంతగా వారమూ వర్జ్యమూ చూసుకువెళ్లినా 'సానుకూల మౌతుంది వెళ్ళు' అనరు ఎవరూను."

"వారమూ వర్జ్యమూ మీదనున్న కోపమంతా నామీద చూపించేస్తున్నారు పోనీండి."

ఇక గంగాప్రవాహ ముప్పొంగి పోతుంది! విషాద సాంద్రత తగ్గించుదామని, "ఒక సేబత్ రోజున రోమక రాజ్యములో ఒక క్రైస్తవ గురువు 'ఇవాళ భానువారము' అన్నాడు బస్ అది భానువారమై కూర్చుంది తరువాత ఒకొక్క గ్రహానికీ ఒకొక్కరోజా పంచిపెట్టారు. అవీ వారాలపేర్లు. బుధవారానికీ బుధుడికీ కాని శుక్రవారానికీ శుక్రుడికీ కాని సంబంధమేమీ లేదు మరి మంచిరోజేమిటి ? పూర్వులు గ్రహాలని అనుకున్నవాటిని మందగాముల నుంచి శీఘ్రగాముల వరకూ వరుసగా వ్రాస్తే శని, గురు అంగారక సూర్య శుక్ర, బుధ, చంద్ర గ్రహాలు వస్తాయి. రోజుకి 24 గంటలు తెల్లవారి ఆరు మొదలు మర్నాడు ఆరు వరకూ రోజు. ఆరు మొదలు ఏడు వరకూ ఉన్న గంట సూర్యుడి ఆధిపత్యానికి తగిలించి, తర్వాతి గంటల్ని వరసగా సూర్యుడి తరవాతి శుక్ర, బుధ, చంద్ర శని, గురు—, లకు తగులుస్తూ పోతే భానువారపు 24 గంటలూ అయాక మర్నాటి ఉదయదపు మొదటి గంట చంద్రుడి దౌతుంది కనక అది చంద్ర—, లేక ఇందు—, వారము. మళ్లీ 24 గంటలు తిప్పితే అంగారకవారమూ, బధ—, గురు—, శుక్ర—, శని, వారాలు వస్తాయి గ్రహాల్ని శీఘ్రగాముల నుంచి మందగాముల వరకూ వ్రాసినా, గంటల్ని కాక ఘడియల్ని ఉపయోగించినా, సేబత్ అన్న క్రైస్తవ ప్రార్థనా దినాన్ని శుక్రవారమనో, చంద్రవారమనో అన్నా ఈనాటి వరస మారిపోయి ఉండును మరి ఈ వారము మంచీ ఆ వారము చెడ్డాట!!"

"వర్జ్య మేమిటిటా ?"

"యత్నాలు ఏవిన్నీ చేయగూడని కాలమట. ఇదిటా, అరవవారికి ఒకటిటా, తెలుగువారికి ఇంకొకటిట! అరవవారికి ఆచారములో, ఈ దుర్ముహూర్తము 48 నిమిషములు, అనగా రెండు గడియలు రోజుకి అసలు 60 ఘడియలు. వాటిలో రెండు ఘడియలు త్యాజ్యముట. ఏమంటే "రాహుకాలము" అన్నారు ఇది ప్రతీ వారానికీ సూర్యోదయానంతరము ఇన్ని ఘడియల ఇన్ని విఘడియలకు వస్తుందన్నారు. దానికి కారణము చెప్పరు ఎవరూ ఆదివారము అనగానే రాహుకాలము 26 ఘడియలకు వస్తుంది. ఇక, దుర్ముహూర్తమని మరొక కాలము. శని—, ఆది—, బుధ—, వారములు తప్ప ఇతర వారాల్లో రెండుమార్లు వస్తుంది. రాహుకాలమూ దుర్ముహూర్తమూ వారమునుబట్టి ఏర్పడ్డ త్యాజ్యకాలాలు"

"నక్షత్రాన్నిబట్టి ఏర్పడ్డ త్యాజ్యము కూడా ఉన్నదా ?"

"ఆ. అదే వర్జ్యము చంద్రుడు రోజుకు ఒక నక్షత్రానికి చేరువగా ఉన్నట్టు కనబడతాడు. ఆ కాలపు ప్రమాణము ఆ నక్షత్రానికి ఆరోపించి, ఆరోజున ఆ నక్షత్రమనీ, ఆ (నక్షత్ర) కాలము 'ఇప్పటినుంచి ఇప్పటివరకూ' అని పంచాంగాలలో వ్రాస్తారు. ఆ నక్షత్ర కాల పరిమితిలో సుమారు గంటన్నర వర్జ్యకాలము ఈ నక్షత్ర త్యాజ్యకాలాలు అశ్వని, భరణి, కృత్తిక .... వంటి 27 నక్షత్రాలకూ 50, 24, 30, 40 .... 24, 30 ఘడియల తరువాత త్యాజ్య ఘడియలు వస్తాయని నిర్ణయము. 'ఈ వరస తిరగవేస్తే ఎందుకు వర్తించదూ ? అని అడిగితే జవాబులేదు."

"వారమూ నక్షత్రమూ అయినాయి తిథి మాటో ?"

"తిథి గండాంతములు అని తిథులనుబట్టి వదిలేయవలసిన కాలాలూ ఉన్నాయి. గ్రహాన్నిబట్టి మూఢము లున్నాయి. అవి సూర్యుడికి చేరువగా ఉన్న కాలాలు వదిలేయాలట. అమావాస్యనాడు సూర్యచంద్రులు భూమికి ఒకవైపున ఉంటారు. కనుక ఆరోజు ప్రారంభాలకు పనికిరాదు. అష్టగ్రహకూటమి ఏమి చెయ్యగలిగిందీ, రెండు గ్రహాల చేరిక చెయ్యడానికీ ?"

"అయిపోయాయా నిషేధకాలాల రకాలు ?"

"లేదు లగ్న త్యాజ్యములు ఉన్నాయి. ఒక్కొక నక్షత్రరాశీ—పండ్రెండింటిలో ఒకటి—భూమ్యాకాశ సంధి రేఖని దాటివచ్చే కాలము లగ్నము. ఆ లగ్నాల దగ్గర మేష—, వృషభ—, కన్య—, ధనస్సు—, రాసు లున్నప్పుడు లగ్నకాలంలో మొదటి అరగడియ (12 నిమిషాలు) త్యాజ్యము"

"ఇన్ని నిషేధాలు ఎలాగు వచ్చి ఉంటాయీ ?"

"అదే ఎవరికీ తెలియదు. అంతా "మహర్షులు చెప్పినవే" ననేవారే."

"మహర్షులు చెప్పినట్లయితే భేదాలెందుకుంటాయీ ?"

"అదిగో అదే నే ననేది. ఇంత విశాలమైన భారత దేశములో ఎన్నో రాజ్యా లుండేవి వారు తిథిని బట్టి, వీరు నక్షత్రాన్ని బట్టీ, ఇంకొకరు వారాన్ని బట్టి ఇంకొకరు తేదీనిబట్టీ త్యాజ్యాలు పెట్టుకున్నారు కాబోలు ఈనాడు అన్నీ వచ్చి నెత్తిన పడ్డాయి వీటిని పాటించడము గొప్ప సదాచారమూ పాటించకపోవడము నాస్తికతానూ మన ముందు వాళ్లు పెట్టుకున్న తట్టలన్నీ మనమూ నెత్తిన పెట్టుకోడము సదాచారము"

"మీరు పెట్టుకొనే దొరటోపీ పూర్వులు పెట్టుకున్నది కాదూ ?"

"నేను పెట్టుకున్నది అదే, ఇప్పుడు ఉండు మరీ ఇప్పుడు నువ్వు పెట్టుకున్నది సరికొత్త ఆచారము నువ్విలాగ వెళ్లి అడుగు ..." అని రాధని తోసేశాను గదిలోంచి.



# లావోస్ సమాచారాలు



ఆధునిక శిల్పం కల ఒక ఈత కొలను.

**లావోస్ ఇండో చైనా ప్రాంతంలో ఒక దేశం.**

అంతదాకా ఫ్రెంచి వారి కింద ఉన్న ఇండోచైనా నాలుగుగా విడిపోయింది— (1) కాంబోడియా, (2) లావోస్, (3) ఉత్తర వియత్నామ్, (4) ద. వియత్నామ్. ఈ నాలుగు దేశాలలో మూడు భాషలు మాట్లాడుతారు. నాలిగిట్లో ఒక లావోస్‌కి మాత్రమే రాజున్నాడు. ఈ రాజుగార్ని 'వతన్నా' అంటారు.

రాజుగారు 'లువాంగ్ ప్రబాంగ్' అనే నగరంలో ఉంటారు. కాని ఇది లావోస్ ముఖ్యపట్నం కాదు. ముఖ్యపట్నం పేరు 'వియంతియన్.' ప్రభుత్వం కార్యాలయాలన్నీ ఇక్కడే ఉంటాయి. మంత్రులు, సైనిక సిబ్బంది వియంతియన్ సమీప ప్రాంతంలో ఉంటారు.

లావోస్‌లోని ఇన్టర్నేషనల్ కార్యాలయం.



రాజుగారంటూ ఉన్నప్పటికీ పార్లమెంటూ, పార్టీలూ ఉంటాయి. ఈ పార్టీల తగాదాలవల్ల పరిపాలన సక్రమంగా జరగటం లేదని అన్నా ఫరవాలేదు. రోడ్లలో దీపాలుండవు. వాటిల్లో ఎక్కడ చూసినా గంట్లు.

ప్రజలు మాత్రం అన్నిటికీ ఓర్చుకుంటారు. ఒక విధమయిన నిస్పృహ వారిని ఆవరించిందేమో అనిపిస్తుంది. వ్యాపారంలో కూడా ఇక్కడి వారు కొంచెం మందంగానే ప్రవర్తిస్తారు. అందుకనే అయివుండవచ్చు, లావోస్‌లో వ్యాపారం ఎక్కువగా వియత్నామీస్, సింధీలు, చైనావారు వీరి చేతుల్లో ఉంటుంది...

అలాగని లావోస్‌లో జీవితం మందంగా ఉంటుందనుకోవటానికి వీల్లేదు. ఇక్కడి ప్రజలు పాశ్చాత్య నాగరికతకి బాగా అలవాటుపడి సరదాగా బ్రతుకుతారు. దిగుమతి నిషేధాలు లేకపోవటం చేత అన్ని రకాల విలాసవస్తువులూ విరివిగా దొరుకుతాయి.

చివరికి భోజన పదార్థాలు— కూరగాయలనుంచి తమలపాకుల దాకా— కూడా దిగుమతి అవవలసిందే! అన్నీ పక్కనే ఉన్న థాయిలాండ్ నుంచి వస్తాయి. ఒకసారి థాయిలాండ్‌కి వెడితే

## "తాగే నీరు బాగుండదు, అందుకని ఎందరో 'బీర్' తాగుతూ ఉంటారు."

రెండు దేశాల మధ్య భేదాలు స్పష్టంగా కనిపిస్తాయి. అక్కడ అన్నీ దొరుకుతాయి. అన్ని సౌకర్యాలూ ఉంటాయి. ఊళ్ళు శుభ్రంగా కనిపిస్తాయి. థాయిలాండ్ పట్నం 'నాంకేయి'కి వెళ్ళిన వాళ్ళు తమకాలం బాగా సరదాగా గడపవచ్చు.

వియంతియన్ పట్నంలో శాకాహారులకి గడపటం కష్టమే. తాగే నీరు బాగుండదు. అందుకని ఎందరో 'బీర్' తాగుతూ ఉంటారు.

మనుష్యులు పొట్టిగా చామనచాయ కలిగి ఉంటారు. మగవారు సూట్లు వేసుకుంటారు. లేదా పైజామా చొక్కా వేసుకుంటారు. స్త్రీలు పట్టులుంగీలు— బాగా ఎంబ్రాయిడరీ చేసినవి— కట్టుకుంటారు. పైన నాజూకైన బ్లవుజులు వేసుకుంటారు. ఆధునికంగా ఉండే వాళ్ళు గవున్లు ధరిస్తారు. కాళ్ళకి జోడు మాత్రం ఉండి తీరవలసిందే. ఈ ప్రాంతాల ఆడవారంతా జుట్టుని గుండ్రటి ముడిగా చుట్టుకుంటారు. (బన్)

జీవితం విషయంలో చూపే సరదాని మరణం విషయంలో కూడా చూపిస్తారు. శవం చుట్టూ కొవ్వొత్తి దీపాలు పెట్టి అందరూ కలిసి ఖులాసా కబుర్లు చెప్పుకుంటారు. చావు పెద్ద విముక్తి అనే వేదాంత వాదానికి ఈ ధోరణి చాలా దగ్గరేమో!

ఇక్కడి భాష లావోషియన్, ఫ్రెంచి. ఇటీవల అమెరికన్ల ప్రభావం వల్ల ఇంగ్లీషు స్థానం కొంచెం ముఖ్యం అవుతోందని చెప్పవచ్చు.

లావోస్ ప్రజలు బౌద్ధులు. వియంతియన్ పట్నం మధ్యలో ఒక పెద్ద బౌద్ధ ఆలయం ఉంటుంది. దీని గోపురం అంతా బంగారు పూత వేసినది.

మొన్నటిదాకా వియంతియన్ నగరం విమానాశ్రయం చాలా చిన్నదిగా ఉండేది. 1963 లో అమెరికన్ల సహాయంతో దానిమీద 50 లక్షల రూపాయలు ఖర్చు చేసి బాగా అభివృద్ధి చేశారు.

రాజకీయ పక్షాల మధ్య సహకారం ఏర్పడే వరకూ లావోస్ పరిస్థితి అంతగా బాగుపడదేమో!

ఎం. ఎస్. ఆర్. బ్రహ్మం. ☆

బంగారు గోపురం కల బౌద్ధుల 'గుడి.'



వనితాలోకం

# ఆధునిక జీవితంలో పాశ్చాత్య ప్రభావాలు

'విశాఖ'

మొన్నీ మధ్య ఆదివారంనాడు నేనూ మావారూ కలిసి మందుల కంపెనీకి వెళ్ళాం. ఆ కంపెనీలో మాకు కావాల్సిన సామాన్లు చెప్పి అక్కడ అవి తయారు అయ్యేంత వరకూ కాచుక్కూర్చున్నాం. ఇంతట్లోగా మాకు పరిచయమున్న ఒక బెంగాలీ ఆవిడ చేతిలో ఒక పెద్ద హ్యాండు బ్యాగుతో వచ్చింది. ఎడమచేతిలో పెంపుడు కుక్క గొలుసుంది. కూడా మనుమరాలు ఆరేడేళ్ళ పిల్ల వచ్చింది. రాగానే వచ్చీరాని ఇంగ్లీషుతో విటమిన్సుకొన్ని ఉండే మందుపేరు చెప్పి ఇయ్యమంది. ఆ కంపెనీ మనిషి తీసుకొచ్చి ఇచ్చాడు.' ఇది ఎలా పుచ్చుకోవాలి?' అని మళ్ళీ ఇంగ్లీషులోనే అడిగింది. అతను 'ఎవరికి? మీ మనవరాలికా?' అన్నాడు. "నో, నో ఇటీజ్ 'టు మై' డార్లింగ్ పప్పీ" అంది. ఈ సంభాషణ విన్న మాకు పొట్ట చెక్కలయింది. కాని సభ్యత కాదని నవ్వు ఆపుకున్నాము. అసలా కంపెనీ మనిషికి బెంగాలీ బాగా వచ్చును. పుట్టి పెరిగింది దాదాపు కలకత్తాలోనే. ఈ మనుషులావిడకు ఇంగ్లీషు బాగా రాదు. "ఇటీజ్ ఫర్ మై డార్లింగ్ పప్పీ" అనడానికి బదులుగా 'టుమై'.. అంది. బెంగాలీలో మాట్లాడితే ఈ తప్పులు ఉండవుకదా! కాని స్టయిల్ కని తప్పుడు ఇంగ్లీషు మాట్లాడ్డం ఇంగ్లీషుని బాగా నేర్చుకోవాలన్న అభిలాషతో కాదు. ఇలా మాట్లాడ్డం ఒట్టి డాబుకోసం. నేర్చుకోవాలన్న అభిలాష ఉన్నవారు తప్పో ఒప్పో మాట్లాడి ఎదుటి వారిచేత తప్పులు దిద్దుకుంటేనే ఇంగ్లీషు బాగా మాట్లాడ్డం అలవాటు అవుతుంది. ఈ బెంగాలీ ఆవిడకి ఇంగ్లీషు నేర్చుకోవాలన్న అభిలాష లేదు కానీ తన స్టేటస్‌కి అలా మాట్లాడితేనే స్టయిలనే ఆవిడ అభిప్రాయం.

ఈ సంఘటన మర్చి పోలేక దాన్నిగూర్చే ఆలో చిస్తున్న నాకు ఈ ఆధునిక జీవితంలో పాశ్చాత్య ప్రభావం ఎంత హెచ్చుగా ఉందో అన్న ఆలోచన వచ్చింది. ఈ ఆధునిక జీవితంలో పాశ్చాత్య ప్రభావం పాశ్చాత్యానుకరణ చాలా ఎక్కువగా ఉంది. 19వ శతాబ్దంలో వ్రాసిన 'కన్యాశుల్కం'లోనే ఎన్ని ఇంగ్లీషు పదాలున్నాయో కదా! పొగ త్రాగడం అన్న విషయం గూర్చి మాట్లాడిన గిరీశం మాటలు తెల్పుతాయి మన భారతీయులపై పాశ్చాత్య ప్రభావం ఎంతుందో. ఒక్కో వ్యక్తిపై ఎంత పాశ్చాత్య ప్రభావం వుంటే ఆవ్యక్తి అంత 'ఫార్వర్డ్' అన్న మాట.

ఈనాడు మధ్య తరగతి సంసారాలలోనూ, ధనిక వర్గాలలోనూ కూడా పాశ్చాత్యానుకరణ కొట్టొచ్చి నట్లు కన్పడుతోంది. అందులోనూ కలకత్తా, ఢిల్లీ, బొంబాయి, హైదరాబాద్, మద్రాసుల్లాంటి పట్టణాలలో ఆహారంలో, అలంకరణలో విలాసకార్య క్రమాలలో అన్నింటిలోనూ కూడా విదేశీ ప్రభావం హెచ్చుగానే ఉంది. బ్రిటీషు వారి పాలనవలన అనేక విధాలుగామార్పులొచ్చాయి. బ్రిటీషువారి పాలన కంటే కూడా పారిశ్రామిక అభివృద్ధి వలననే పాశ్చాత్యాను కరణఎక్కువయిందని నాఉద్దేశం. దేశం పారిశ్రామికంగా ఉన్నత ప్రమాణాలందుకోవాలని అనేక భారీ పరిశ్రమలని నెలకొల్పి దానికి కావాల్సిన సాంకేతిక నిపుణులని పైదేశాలనుంచి రప్పించటం ఇప్పుడు రివాజయింది.

పూర్వపు ఇళ్ళు వేరే విధంగా వుండేవి. మండువా, వసారా, కొట్టుగది, పెరడు వగైరాలతో వుండేది. పరిశ్రమలు అభివృద్ధి చెందిన కొద్దీ వ్యాపారరీత్యా నైతే నేమి ఉద్యోగరీత్యా నైతేనేమి జనం పట్టణాల కేసి కదిలారు. దానితో పట్టణాలలో ఇళ్ళకి కరువొ చ్చింది. ఈ సమస్య పరిష్కరించడానికని విదేశాలలో లాగా 'ఫ్లాట్సు'గా కట్టి ఒక్క భవంతిలోనే అనేక మంది కాపురాలుండేటట్లుగా సౌకర్యాలు కలిపి



లండన్‌లో స్త్రీలకు దుస్తులపట్ల మక్కువ ఎక్కువ. అందుకే అక్కడ రోజురోజుకీ ఫేషన్లు మారిపోతూ వుంటాయి.

చేశారు. ఫ్లాట్సు—రెండు మూడు గదులవే మధ్య తరగతి సంసారాలకి అందుబాటులో వుం టాయి. ఈరెండు మూడు గదుల్లో సంసారాన్నంతా అమర్చు కోవలసి వచ్చేసరికి గృహిణికి చాలా యిబ్బంది. కర్రలు, పొయ్యి, తిరగలి, రుబ్బుగుంట ఇవన్నీ చాలా చోటుని ఆక్రమిస్తాయి. అందుకే కిరసనాయిలు స్టవ్వులు మొదలెట్టారు చాలామంది ఒక్క కిరసనాయిలు డబ్బా, స్టవ్వు— ఇవి ఆట్టే చోటు ఆక్రమించవు సరిగ్గా వాడితే మసీ అవదు. కాస్త ముందు పెట్టుబడి పెట్టగల్గితే గ్యాసు పెట్టించుకుంటున్నారు ఈగ్యాసుపరిశ్రమల మూలాంగానే అందరికీ అభిస్తోంది కొంత మంది అప్పోసప్పోచేసి వాషింగు మెషిను అనీ,ఎలక్ట్రిక్‌మిక్సీ అనీ, అవి కొనుక్కుంటున్నారు. దాంతో గృహిణి దైనందిన కార్యక్రమం కూడా పాశ్చాత్యుల విధంగానే నిర్ణయించు కుంటోంది

పారిశ్రామిక నగరాలలో పాశ్చాత్యులతో కలసి మెలసి ఉండటం వలన ఆహారంలో అలంకరణలోనూ వారి ప్రభావం కన్పడుతోంది చాలామందికి నేవీ, ఏర్ ఫోర్సు, ఆర్మీవారివల్లే పాశ్చాత్యానుకరణ వ్యాపించిందని అభిప్రాయం కానీ వాళ్ళకిచ్చే క్వార్టర్సు నగరానికి వెలుపల వుంటాయి. మరీ ఉన్నతోద్యోగులయితే తప్పించి వారికీ సివిలువారికి సంబంధం ఉండదు. కాని పారిశ్రామిక నగరాలలో క్వార్టర్సు వలన ఇంచు మించుగా అందరికీ పరిచయాలేర్పడుతాయి. ఒకరి అలవాట్లు ఇంకొకరు తెల్సుకుంటారు. పూర్వం ప్రొద్దుటే పిల్లలు చద్ది అన్నం తినేవారు. ఇప్పుడీ పట్టణాలలో పిల్లలకి అది సయించదు పూర్వం పిల్లలకి అయిస్ క్రీమూ, సెలాడ్స్, క్యాడ్ బరీస్ చాక్‌లెట్లూ తెలీవు ఇప్పటి పిల్లలకి అయిస్ క్రీమే ప్రాణం

ఈనగరాలలో అలంకరణ సాధనాలు (లిప్‌స్టిక్, పవుడర్, స్నో, కోల్డ్‌క్రీమ్ వగైరాలు) అందరూ వాడుతారు. మన ఆంధ్ర ప్రదేశ్ అంతర్భాగంలో వున్నవారికి, మధ్య తరగతి స్త్రీలకి ఇవి అందుబాటులో లేవని ఒక అభిప్రాయం. కాని ఇక్కడ బీదా గొప్ప తారతమ్యం లేకుండా అందరూ వాడుతున్నారు. ప్రతీ వారు కట్టుకున్న చీర వెల పది అవనీండి వంద అవనీండి ముఖానికి మేకప్ లేకుండా బయటకి వెళ్ళరు. సీవ్‌లెస్‌జౌసు అతిసాధారణమైనవిషయం. పవుడర్ రాసుకుని, లిప్‌స్టిక్ వేసుకుని, కాటుక తీర్చి దిద్దుకుని చేతిల్లో హ్యాండు బ్యాగుతో బయల్దేరతారు ఆహ్యాండు బ్యాగులు కూడా మూడునుంచీ ముప్ఫై రూపాయలదాకా రకరకాలు. అలంకరణలో అతి శ్రద్ధచూపి సుందరంగా మనోహరంగా కనిపిస్తారు.

ప్రతీ నగరంలోనూ పాశ్చాత్య పద్ధతిన కట్టబడిన రెస్టారెంట్సున్నాయి. కొన్నింటిల్లో మ్యూజిక్ ఉంటుంది. అదీ పాశ్చాత్య సంగీతమే కొన్నింటిలో జూక్ బాక్సులుంటాయి. ఇంక 'కాబరేలు' 'ఫ్లోర్ షోలు' కూడా ఉన్నాయి. వీటికి తగినంత ఆదరణ లేకపోతే వీటిని నడపడానికి ధైర్యం ఎవరికుంటుంది. ఏ వ్యాపారం అయినా లాభం ఉంటేగానీ నడవదు. ఈ విలాస జీవనం అందరికీ అందుబాటులో లేదు కానీ సాధారణంగా వీటికి వెళ్లితే ఆ ఖర్చు చాల ఎక్కువ అని భయపడేవారికి కూడా కొన్ని కారణాల వల్ల వెళ్లే అవకాశం కల్గుతోంది—అదీ—కొన్ని కంపెనీలలో 'ఎంటర్‌టెయిన్‌మెంట్' కని ప్రత్యేకంగా డబ్బిస్తారు. పెద్ద పెద్ద కంపెనీలలో ఈలాటి రెస్టారెంట్సులో పార్టీలిచ్చి ఒకరినొకరు పరిచయం చేసుకుంటారు—ఇదీ పరిశ్రమల వృద్ధి వలన వ్యాపారము అభివృద్ధి చేసుకోవాలన్న కాంక్షా ఫలితమే. ఇవన్నీ పాశ్చాత్యులని అనుకరించటమేను.

పూర్వం సెలవుల్లో బంధువర్గాలని చూడ్డాని కెళ్లేవారు. ఇప్పుడో పాశ్చాత్యులలాగా క్రొత్త ప్రదేశాలని చూడ్డానికి వెళ్తున్నారు. "డేటింగు" ఈ పట్టణాలలో బాగా వ్యాపించింది. మన వూళ్లో ఆట్టే లేదు. మన గ్రామాలలో అసలే లేదు కానీ ఇక్కడ చాలామంది తమ ఆడపిల్లల్ని వాళ్ళ బాయ్ ఫ్రెండ్సుతో సినిమాలకి అదీ వెళ్లడానికి అనుమతిస్తున్నారు. వీటివల్ల మంచి జరుగుతోందా చెడ్డే జరుగుతోందా అన్నది వ్యక్తిగతాభిప్రాయం బట్టే ఉంటుంది.

కొందరిళ్లలో పిల్లలకి భారతీయ సంగీతం— కనీసం సినిమా సంగీతం అన్నా—తెలియకపోయినా 'బీటిల్సు' అంటే బాగా తెల్సు. ఒక ఆంగ్ల పత్రికలో వీటి కంతటికీ తల్లే కారణం అని వ్రాసారు. కానీ తల్లికి కర్ణాటక సంగీతమే మక్కువయ్యైనా ఆవిడ ఆ కర్ణాటక సంగీతం వినమని చెప్పినా వినక ట్విస్టు మ్యూజిక్, బీటిల్సు పాటలని మాత్రం వినేవారున్నారు

"హిందీ" రాజభాష కావాలన్నవారు కూడా (చాలా మందేను) ఆంగ్లభాషంటేనే మోజు చూపుతున్నారు. ఆంగ్లభాషలో విద్య బోధించే పాఠశాలలోనే తమ పిల్లల్ని చేర్పిస్తారు ఇందులో తల్లుల అభిప్రాయానికే ప్రాముఖ్యం ఎక్కువ ఈ పట్టణాలలో ఇంగ్లీషు మీడియం స్కూళ్లల్లో సీట్లు దొరకడం చాలా కష్టం. రెండేసి సంవత్సరాలకి ముందుగానే సీటు రిజర్వు చేసుకోవాలి సినిమాకీ, రైలుకీ అడ్వాన్సు బుకింగులాగే స్కూల్లో సీటుకి అడ్వాన్సు బుకింగని మా బాబాయి వేళాకోళం చేస్తారు. మద్రాసులో ఒక స్కూల్లో తన కొడుక్కి సీటు రిజర్వు చేసుకుని మరీ ఇంగ్లాండెళ్లింది ఒకావిడ. ఆవిడ తిరిగి రావడానికి రెండేళ్ళవుతుంది. ఇంగ్లండు వెళ్లేటప్పటికి పిల్లాడికి ఏణ్ణర్థం తిరిగి వచ్చాక వాడు ఆ స్కూల్లోనే చదవాలన్న అభిలాష ఆవిడకి. ఇది నిజంగా జరిగింది. అతిశయోక్తి కాదు. వీటన్నింటికీ కారణం ఆంగ్లభాషా వ్యామోహమేను.

పాశ్చాత్యదేశాలలోలాగా మన దేశంలో, పూర్వం 'మాడలింగు' వృత్తిగా ఆడవాళ్లు తీసుకునేవారు కాదు. ఒక్క సినిమాతారలు మాత్రమే 'మోడల్సు' గా ఉండేవారు. ఫలానా తార ఫలానా సబ్బు వాడుతోంది, ఫలానా తార చెప్పుతోంది, ఫలానా మార్కు శ్రేష్టమని వగైరా వగైరా. కాని ఇప్పుడో— మాడలింగు అంటే వ్యామోహంలేని 'టీన్ ఏజ్' పిల్లలే లేరు. తిండి కూడా సరిగ్గా తినక సన్నంగా ఉండాలన్న తాపత్రయం అందరికీ. ప్రతి కంపెనీ వారూ తమ వ్యాపారం అభివృద్ధి చెందాలని అనేక రకమైన ప్రకటనలు చేస్తారు. అందులో ప్రత్యేకంగా విలాస పరికరాలు, వస్త్రాలు వీటికి ప్రకటనలు ఇవ్వడానికి స్త్రీలనే ప్రత్యేకంగా కోరుతారు. ఎవరికి వారు తమ ప్రకటనే చూపరుల నాకర్షించాలని మంచి ఫిగర్ ఉండేవాళ్ళని ఎన్నుకుని ఫోటోలు తీసి ప్రకటిస్తున్నారు. ఈ పాశ్చాత్య విధానపు ప్రకటనలకి మూలకారణం పారిశ్రామిక వ్యాపార కాంక్షేను.

అలాగే ప్రయాణీకులు, అతిథులు, సౌకర్యాలన్నీ సరిగ్గా అమరితేనే తిరిగి తమ విమానాల్లో ప్రయాణిస్తారు, తమ కంపెనీకి వస్తారు అన్న ఉద్దేశంతో ఈ పనులకి స్త్రీలనే నియోగిస్తున్నారు. రిసెప్షనిస్టులూ, ఏర్‌హోస్టెస్‌లూ నర్సులూ, ఆడవారే ఎక్కువమంది మధ్యతరగతి స్త్రీలకి ఉద్యోగావకాశాలు ఎక్కువైనాయన్నమాట.

పాశ్చాత్య ప్రభావంవల్ల మానవజీవిత ప్రమాణాలు ఎక్కువే అవుతున్నాయి. పాశ్చాత్యానుకరణ తప్పుకాదు కానీ ప్రతీ జాతివారు జాతిని గూర్చి క్షుణ్ణంగా తెల్సుకుని మరీ మిగతావారిని గూర్చి తెల్సుకోవాలి. అప్పుడే వారిలోని మంచిని మాత్రం గ్రహించి చెడ్డని గ్రహించరని నా ఉద్దేశం. విదేశాల నుంచి వచ్చేవారు తమ దేశపు సాంఘిక ఆచారాలనీ, రాజకీయ విషయాలనీ ముందర పూర్తిగా నేర్చుకుంటారు. ఆపైని మనదేశం గూర్చి కూడా కాస్త తెల్సుకుని మరీ వస్తారు కానీ మనవారిలా కాదు విదేశానికెళ్లే ప్రతీ భారతీయుడూ మొదట భారతదేశం గూర్చి వీలయినంత తెల్సుకుని మరీ వెళ్లాలి. విదేశీయులకి మన చీర అంటే మోజు. మన కుంకుమబొట్టు వారిని ఆకట్టేస్తుంది. మన గాజుల మ్రోత వారి చెవుల కింపుగా ఉంటుంది. మన ముక్కుపుడక,మట్టెలు,మంగళసూత్రాలు వారికి వింతగా ఉంటాయి. ప్రశ్నలు వరుసగా వేస్తారు. మనవారిలో కొందరికి జీన్సూ, స్లాక్సూ నచ్చుతున్నాయి. ఇందులో తప్పొప్పుల ప్రసక్తే లేదు. "పొరుగంటి పుల్ల కూర రుచి" అన్న సామెత అక్షరాలా నిజం ★

# వంటలు

## పెరుగుతో పెసరట్లకూర

ఈ కూరకి కమ్మటి పెరుగైతే చాలా రుచిగా ఉంటుంది. పెరుగులో ఉప్పు, పసుపువేసి ఉంచుకోవాలి. పెరుగు పచ్చడి మాదిరిగా ఎండు మిరప ముక్కలు, మినపప్పు, ఆవాలు, కరివేపాకు నేతితో పోపుపెట్టి పెరుగులో కలపాలి. పోపు పెట్టిన పెరుగులో పెసరట్టు ముక్కలు వేసి కొత్తిమీర తరిగి వేసుకుంటే తినడానికి, చూడడానికి కూడా బాగుంటుంది. ఇది అన్నంలోకే కాకుండా టిఫిన్‌గా కూడా బాగుంటుంది.

## పోపు పెట్టినకూర

పెసరట్లు పిండి రుబ్బుకుని, దళసరిగా అట్లు చేసుకుని కావలసిన సైజులో ముక్కలు కోసుకోవాలి ఆవాలు, మినపప్పు, ఎండు మిరపముక్కలు, జీలకర్ర, వెల్లుల్లి, కరివేపాకు పోపుపెట్టి, పెసరట్టు ముక్కలు కూడా వేసి, తగినంత మారిన ఉప్పు, పసుపువేసి ముక్కలను గరిటెతో కలపకుండా, అంతా కలిసేలా కుదిపి, మూతపెట్టి, అయిదు నిమిషాలు పొయ్యిమీద ఉంచి మగ్గాక దించేముందు కొత్తిమీర సన్నగా తరిగివేస్తే కూర మంచి వాసనతో ఘుమఘుమ లాడుతూ రుచిగా ఉంటుంది.

తె. వి. లక్ష్మి. ★

సీరియల్:

# పసిడిమనసులు



"హరికిషన్"

### జరిగిన కథ

భాస్కర్‌గారి ఏకైక పుత్రిక జ్యోతికి, వ్యాపారి రంగనాయకులుగారబ్బాయి రఘుకి స్నేహం పెంపొంది మనస్సులు కలుస్తాయి. తనంటే అయిష్టత చూపేవ రఘూ మేనత్త ప్రవర్తనకు కారణం తెల్సుకుంటుంది జ్యోతి. ముందు వెనకలు ఆలోచించకుండా మనస్సును రఘుకి అర్పించినందుకు మథనపడుతుంటుంది.

## 4

అందరికీ నచ్చిన ఆ కథ రోహిణికి నచ్చలేదు. అందులో నాయకుడు హద్దుమీరి ప్రవర్తించాడన్నది. పెద్దవాళ్లు పిల్లల మనస్తత్వాలు తెల్సుకోలేని తమ పెద్దరికం నిలుపుకోటానికి మూర్ఖత్వంగా ప్రవర్తించారని విమర్శించింది. కథానాయకునికి పెద్దలమాటయందే గురి, అభిమానమూ ఉన్నప్పుడు ముందు వెనకలు ఆలోచించక నాయకిని పెళ్లి చేసుకుంటానని వాగ్దానం చెయ్యటము చాలా తప్పనీ, ఆత్మవంచన చేసుకున్నట్లే అయిందనీ, ఈవిధంగా నాయకుని పాత్ర పేలవంగా తయారయిందనీ వ్యాఖ్యానించింది. ఆ విమర్శలన్నీ శ్రద్ధగా విన్నది రజని.

కథలూ, నాటకాలూ, నవలలూ రాయటం ఒక తరహాకు చెందిన వ్యక్తులు మాత్రమే చేయగల్గుతారు వారి మేధాశక్తి, పాత్రల సృష్టి, పాత్ర పోషణ, కథాగమనమూ చూచుకోవటం వరకే పరిమిత మవుతుంది. అంటే వంటలవాడు ఆహార పదార్థాలన్నీ సమకూర్చుకుని వంట చేసినట్లు. ఆ వంటచేసిన పదార్థాలు తిని ఉప్పు తక్కువయిందనో, కారం ఎక్కువయిందనో, తీపి చాల

లేదనో చెప్పటం, తినేవారి వంతు. విమర్శకుని పద్ధతి ఈ చేసిన పదార్థాలు తినేవారి వంతు లాంటిది. ఈ షడ్రుచులూ, రుచి చూసి చెప్పటం కూడా అందరికీ చేతకాని విషయమే. అట్లాగే సరయిన విమర్శకులకే సారస్వతంమీద వ్యాఖ్యానం చెయ్యటం చేతనవుతుంది. కువిమర్శలు చేసేవాళ్ళు ఉప్పు తక్కువయిందని చెప్పేబదులు, కారం ఎక్కువయిందని చెప్పినట్టుగా ఉంటుంది. సాహిత్య విమర్శ విషయంలో రోహిణి మనస్తత్వంకూడా ఇలాంటిదే.

రోహిణి విమర్శ విన్న తరువాత రజని ఇట్లా అన్నది.

“నీ విమర్శను అర్థంచేసుకున్నాను రోహిణీ, పాత్ర పోషణా, కథాగమనమూ ఆ కథకు అంతకన్న కుదరదు. ఏ కథలోనైనా కథానాయకి పాత్రను మన సంస్కృతికి భిన్నంగా చిత్రించకూడదు. నిత్య జీవితంలో పరమ గయ్యాళి లాంటి స్త్రీలు ఉండొచ్చు. అలాంటి వ్యక్తులను అత్తగారి తరహా పాత్రలుగానే చిత్రించాలి గాని, పెళ్ళిగాని నాయకి పాత్రలకు తీసుకుని చిత్రించకూడదు. రెండో పక్షంలో వివాహిత స్త్రీగా తీసుకుని సంసార జీవితంలో కొన్ని విషయాల్లో భర్తను ఎదిరించే గడసరిగా చిత్రించవచ్చు. పెళ్ళిగాని కన్యకు అలాంటి పాత్రపోషణ చేస్తే ఆ కథానాయకిమీద కథానాయకునికే గాక, చదువరులకు కూడా సానుభూతి కలుగదు. ఏమంటావు.”

రోహిణి నవ్వింది. ఆ నవ్వులో ఏదో అర్థంలేని గర్వం తొణికిసలాడింది. అక్కయ్య ఇంత పిచ్చిదేమో అనుకుంది. ఇలాంటి భావాలనే మనస్సులో పదిలపర్చుకుంటే ఇంక ఆ వచ్చే బావ ఎవరో, ఆయనకు దాసానుదాసురాలుగానే వూడిగం చేస్తుందికామో అనుకుంది. అణకువ, స్త్రీత్వంలోని అతి లాలిత్యమూ, అతి మర్యాదగల గృహిణి, భర్త పాదధూళి స్వీకరించే తీరుగల మనస్తత్వం కలదే అవుతుంది గాని, తన మనస్తత్వానికి తగినట్లుగా భర్తను తీర్చిదిద్దుకోలే దనుకున్నది.

“ఏమిటే రోహిణీ నవ్వుతున్నావ్. నా కథను పఠించిన నా వ్యాఖ్యానం నీకు నచ్చలేదా. పుస్తకాల్లోని పాత్రల జీవితాన్ని కూడా నిత్య జీవితాలకు అనుగుణంగా ఉన్నట్లుగా తీర్చిదిద్దితేనే ఆ పాత్రలు రాణిస్తాయి. ఒక్కొక్కప్పుడు సంభాషణల్లో పొందికకోసం కొన్ని కొన్ని ప్రయోగాత్మకమైన మాటల్ని వాడుతాము. ఆ మాటలు చదివినప్పుడే వీనులకు విందుగా మనస్సుకు హత్తుకున్నట్లుగా ఉంటాయిగాని జీవితంలో ఎవ్వరూ అలా ప్రవర్తించరు” అన్నది రజని.

“అదే నేనూ చెప్పబోయేది” అన్నది రోహిణి, తానేదో తెల్సుకున్నదానిలా.

“అదేమిటో చెప్పరాదూ” అన్నది రజని

“నువ్వు సృష్టించిన సుందరి విషయమే నేను చెప్పేది.

‘నన్ను మనసారా నువ్వు ప్రేమించలేకపోయినా, నేను ఎప్పటికీ నీ దాసురాలినే మోహన్. ఈ దీనురాలికి నీ హృదయంలో కాస్త చోటు యిస్తే చాలు, నీ చరణదాసిగా స్వీకరించినా, కృతజ్ఞురాలిగా నా జీవితాన్ని నీ అడుగుజాడల్లో తీర్చిదిద్దుకుంటాను’ అంటుంది ఆ సుందరి. ఎంత హీనాతి హీనంగా ఎందుకు సృష్టించావా నేనందరిని. హృదయంలో చోటట, చరణదాసిట, అడుగుజాడలుట. ఇవన్నీ నిత్యజీవితంలో అనుకునే మాటలేనా” అన్నది రోహిణి.

ఈ మాటలకు నవ్వింది రజని.

“సాహిత్యసృష్ట్యై, కావ్యానుసారంగా, కల్పిత పాత్రలచేత, కాల్పనిక జగత్తులో అట్లా ప్రసావింపజేస్తేనే ఆ రచన ఉత్కృష్టమైనదిగా ఉంటుంది. లేకపోతే భాషాపాటవంలేని పామరజనం మాట్లాడినట్లే ఉంటుంది. నీ హృదయంలో చోటివ్వమన్నంత మాత్రాన గుండెలు చీల్చుకుని లోపలికి పోయి ఎవ్వరూ నిద్రపోరు. చరణదాసి అన్నంత మాత్రాన జీవితాంతమూ కాళ్ళవద్దనే అన్నం, నీళ్ళ లేకుండా కూర్చోరు. అడుగుజాడ అంటే భర్త వేసిన బూట్లకాళ్ళ అడుగుజాడల్లోనే భార్య నడవాలని కాదు. అట్లా నడిస్తే ఆ భార్య కూడా వంటవని మానేసి ఆయనతోబాటుగా ఆఫీసుకే పోతుంది లేక చీట్లాట క్లబ్బులకే పోవచ్చు. భార్యాలోలుడైన భర్తని పారిభాషిక పదాల్లో ఆయన ఎప్పుడూ పెళ్ళాం కొంగు పుచ్చుకునే తిరుగుతాడు అంటారు. అంతమాత్రంచేత ఆయన ఉద్యోగం మానుకుని ఆ భార్య వెనక చీరె కొంగు పుచ్చుకునే తిరుగుతుంటాడా. రచనల్లో, శైలిలో అట్లాంటి పదాలు వాడక తప్పదు. అంత మాత్రంచేత వాటికి సరైన అచ్చతెలుగు అర్థాలనే తియ్యకూడదు.” అన్నది రజని.

ఏం చెప్పటానికీ తోచలేదు రోహిణికి. ఎందుకో తల్లి పిలవంగానే వెళ్ళిపోయింది.

పత్రికలో తన ఫోటోను చూసుకుంటూ కూర్చుంది రజని.

మరుసటివారం, వారపత్రిక వచ్చింది. ఉత్తరాలు శీర్షికలో రజని కథమీద చాలామంది విమర్శలు వచ్చినయ్యి. పాత్రపోషణ, కథాగమనము ఎంతో ఉన్నతంగానూ, నూతన పంథాలోనూ, వాస్తవికతకు అతి దగ్గరగానూ ఉన్నవని ప్రస్తుతించారు. ఒక్కరి విమర్శ మాత్రం రోహిణి అభిప్రాయాలకు అనుగుణ్యంగానే ఉన్నది. ఆ ఉత్తరమే పదిసార్లు చదువుకున్నది రజని.

‘పాఠకుల ఉత్తరాలు రచయితను పది కాలాల పాటు రచయితగా బ్రతికింపజేసేవి. వాటిల్లో యదార్థాన్ని పది కోణాల్లోనుంచి, పది దృక్పథాల్లోనుంచి వెలుపలికి తెచ్చేవి గనుక, ప్రతి రచయితా తమను గురించి లోకం ఏమనుకుంటున్నదో నని ఆ ఉత్తరాల ద్వారా తెల్సుకోవాలి సద్విమర్శల్నీ, చెడు విమర్శల్ని మననం చేసుకుని వాటితో తమ రచనల్ని పోల్చి చూసుకున్నప్పుడే మరోసారి అలాంటి భావాల్ని, సంఘటనలని తన రచనల్లో రచయిత ముందు ముందు రానీయడు. ఆ ఉత్తరాల్లోని పొగడ్తలనే తీసుకుని, నిజమైన నిష్పక్షికమైన విమర్శల్ని వదిలేస్తే ఆ రచయిత రచనలు అతని తోనే అంతరించిపోతయ్యి’.

రజనికి అన్ని ఉత్తరాలూ చదివిన సంతోషం కన్న ఆ ఉత్తరం చదివితేనే ఎక్కువ సంతోషం కలిగింది. ఎందుకంటే ముఖప్రీతికి గాక, కూలంకషంగా చర్చించిన ఉత్తరం అదొక్కటే.

రోహిణికి ఆ ఉత్తరం చూపింది రజని. అదే ఉత్తరాన్ని పాతికసార్లు చదివింది రోహిణి. తన సంతోషానికి హద్దులేదు.

“ఇప్పుడయినా తెల్సుకున్నావా అక్కా, తాడిదన్నేవా డొకడుంటే, తల దన్నేవాడు మరొకడని” అన్నది రోహిణి.

“ఎందుకే అంత సంతోషం రోహిణీ. అన్ని ఉత్తరాలకన్న ఆ ఉత్తరమే బాకూ వచ్చింది. తెల్సిందా” అన్నది, రజని.

“కనుక నా విమర్శకూ విలువ ఉన్నదని ఒప్పుకుంటావా ఈ తెలివితక్కువది ఏదో వాగుతున్నది, దీనికేం కథలు రాయటం వచ్చా, చచ్చా, అని అనుకుంటావా” అన్నది మళ్లీ రోహిణి.

“మీ యిద్దరి విమర్శల్నీ సహృదయంతో స్వీకరించామ నరేనా ”

“వెరీగుడ్. అలాంటి వెర్రి మొర్రి కథలు రాయకు తెల్సిందా” అంటూ వెళ్లింది రోహిణి.

రోహిణి వెళ్ళినవైపే చూస్తూ కూర్చుంది రజని

రాత్రి భోజనాల దగ్గర మళ్లా రోహిణి ఆ ఉత్తరం ప్రసక్తి తెచ్చింది.

“చూశారా, నాన్నగారూ” రజనివైపు చూస్తూ అన్నది రోహిణి.

“ఏమిటమ్మా రోహిణీ” అన్నాడు తండ్రి ఇద్దరివైపు చూస్తూ.

“అక్కయ్య కథమీద వచ్చిన ఉత్తరాలు పత్రికలో చదివారా.”

“చదివానమ్మా చదివాను. ఎవరి భావాలు వారు వెల్లడించుకోవటంలో తప్పేముంది కథ వ్రాసి ప్రైజు తెచ్చుకుందేమో, విమర్శలు చూసి తన కథల్లోని మంచి చెడ్డలను తెల్సుకుంటుంది. రజనికి అదొక హాబీ. నీకూ, నాకూ కథలు రాయటమూ రాదు. మనకు ఉత్తరాలూ రావు. అంతేనా” అన్నాడు తండ్రి నవ్వుతూ.

“బాగా చెప్పారు నాన్నా” అన్నది రజని.

రోహిణికి కోపం వచ్చింది. కాని అది అదను కాదని తనలో తనే సర్దుకుంది.

“నాకో సందేహం నాన్నా” అన్నది రోహిణి

“ఏమిటమ్మా అది ”

“చాలామంది రచయితలు తమ తమ భావాలనే తమ ఉద్దేశ్యాలనే కథల్లో, నవలల్లో పాత్రలచేత చెప్పిస్తారుకదూ.”

“కొంతవరకూ అంతే కావచ్చు. కాని పూర్తిగా మాత్రం కాదు. కేవలంగా తమ భావాలనే ఉటంకిస్తూ కూర్చుంటే ఆ రచనల్లో సారస్యం ఉండక పోవటమే గాక సరైన దృక్పథంలో తాము చిత్రించదల్చుకున్న పాత్రల స్వభావాలు వెలికి తీసుకురాలేరు. పాత్రల స్వభావాన్ని పూర్తిగా మనస్సులో ఆకళింపు చేసుకుని ఆ పాత్రలకు తమ మనోభావాల కలయికతో రూపురేఖలు దిద్దితేనే రచనల్లో అలాంటి చిత్రించిన పాత్రలకు ఒక విశిష్టత ఏర్పడుతుంది. లేకపోతే ఆ రచనలు కేవలంగా తమ జీవితగాథలో లేక పేలవమైన, నిర్జీవమైన పాత్రలుగానో ఉండిపోతయ్యి అందుచేతనే రచయితలకు అనుభవాలకన్న ఆలోచనలే ఎక్కువ ఉండి భావనా ప్రపంచంలో విహరించగలిగితేనే పది కాలాలపాటు నిలిచే రచనలన్ని వెలికి తీసుకురాగలుగుతారు.” అన్నారాయన.

# పసిడి మనసులు

తండ్రి మాటలకు ఆశ్చర్యపడింది రోహిణి. ఆయన భావాలతో పూర్తిగా ఏకీభవించింది రజని.

భోజనాలయినయ్యి.

"రోహిణీ."

"ఏం నాన్నారూ."

"నువ్వు ఒక చక్కని కథ రాసి ఏ పత్రిక కయినా పంపరాదా రోహిణీ నీ భావాలూ ఎట్లా ఉంటయ్యో తెల్సుకుంటాను." అన్నా డాయన.

"అవున్నానారూ. రోహిణీ కథ రాసి పంపితే వెంటనే చదవకుండా ప్రచురిస్తారు. ఎందుకంటే దాని భావాలు నా మాదిరిగా పూర్వకాలపు వాసనలను సంతరించుకోవు. నా కథల్లోని భావాలు సన్నజాజు లయితే, దాని భావాలు సంపెంగపూల వంటివి. ఎక్కువ సౌరభాన్ని సంపెంగలే వెదజల్లుతయ్యి. అవునా రోహిణీ" అన్నది రజని.

రోహిణి ముభావకంగానే వూరుకుంది. అక్కయ్య మాదిరిగా కథలు రాయలేకపోతున్నానే అనే దిగులూ కాంక్ష ఒకదాని కొకటి పెనవేసుకున్నయ్యి.

"నువ్వూ, నాన్నారూ కలిసి నన్ను ఆట పట్టిస్తున్నారు. సరే కానివ్వండి" అంటూ బుంగమూతి పెట్టి చూడసాగింది రోహిణీ

కూతుళ్ళవైపు చూసి ఆయనా నవ్వుకున్నాడు. వారిద్దరూ ఆయనకు దివ్యజ్యోతులు.

* * *

సుందర్రావుగారు రాజమండ్రిలో మంచి పేరు బడ్డ వకీలు. నలుగురిలోనూ మంచివాడన్న పేరు తెచ్చుకున్నాడు. పిత్రార్జితమైన పది ఎకరాల పొలం గాక స్వార్జితంమీద రాజమండ్రిలో మంచి డాబా ఇల్లు కట్టాడు. క్రమేపీ పదెకరాల పొలమూ ఇరవై ఎకరాలయింది భార్య రమణమ్మ కాపురానికి వచ్చిన పదేళ్ళ వరకూ వారికి సంతానం లేదు. పిల్లలకోసం ఎంతో తపించిపోయారా దంపతులు నోములూ, వ్రతాలూ, తీర్థయాత్రలు నాగప్రతిష్టలూ కాగా, పదేళ్ళకుగాను ఆవిడ గర్భవతి అయింది వారి సంతోషానికి అవధులు లేవు. డాక్టరు బిల్లులకు మితిలేదు. నెలలు వస్తున్నకొద్దీ ఆవిడకు వూపిరి సలపటంలేదు. మందులూ, టానిక్కుల మంచి పిండం బాగా ఎదుగుతోందని నవ్వుతూ చెప్పింది లేడీ డాక్టరు. పుష్టికరమైన బిడ్డ పుడుతుందన్నారు మరొక స్పెషలిస్టు. ఇది కాదని ఎక్స్‌రే తీయించారు. కవలపిల్లలని తేలింది. కష్టమైనా సంతోషంగానే ఉన్నారా దంపతులు. ఆ ఘడియ రానే వచ్చింది. గవర్నమెంటు ఆస్పత్రిలో చేర్పించారు.

కాన్పుల గదిలో రమణమ్మ ప్రసవవేదన పడుతుంటే, ఆ కష్టం తనకే వచ్చినంతగా కళ్ళు తుడ్చుకున్నారు సుందర్రావుగారు. మనస్సుకు నచ్చిన అందరు దేవుళ్ళకూ మొక్కాడు. బార్ కౌన్సిల్‌లో ప్లీడర్లంతా మరేం ఫరవాలేదని ఆయన్ను వోదార్చారు. కొంతమంది తమ అనుభవాలు చెప్పారు. పదిమంది పిల్లలుగల తండ్రులకు ఈయన మనోవేదనంతా వారి మనస్సుకు ఏదో హంగామాగా తోచింది. ఏభయ్యోపడి దాటిన ఒక అడ్వకేటుగారు మాత్రం సుందర్రావుగారి పక్కనే ఉండి చాలా హితోక్తులూ, ఛలోక్తులు చెప్పి

ఆయన్ను నవ్వించాడు. ఆయన భార్యకు అయిదో కానుపులో ముగ్గురు ఆడపిల్లలుట "టిక్కట్టు పెడితే, కొన్ని వందలు సంపాదించేవాడివి సుందర్రావూ! కాని, నా భార్య వద్దన్నది" అన్నాడాయన. అది నిజమో, అబద్ధమో, ఆయన్ను ఎవ్వరూ అడగలేదు. ఏమయినా ఆ సమయంలో అనేక అనునయవాక్యాలు చెప్పి వూరడించాలికదా!

మరో అరగంట గడిచింది అంతలోనే ఇంత కళ్ళు చేసుకుని సుందర్రావుగారి వదినెగారు, అంత దూరంనుంచే "రవణకు ఇద్దరు కవలపిల్లలు, ఆడపిల్లలు" అన్నది. క్రికెట్ ఆటలో ఇంగ్లండుపై భారతదేశం గెలిచి రబ్బరు సాధించినంత సంతోషం కలిగిం దాయనకు.

"పిల్లలు ఎట్లా ఉన్నారు వదినా, రవణ కులాసాగా ఉన్నదా" అన్నా డాయన నవ్వుతూ.

"బాగానే ఉన్నారు. ఇప్పుడు వాళ్లకు పళ్ళు కడగటానికి తీసుకువెళ్లింది నర్సు ఆదిలక్ష్మి" అన్న దావిడ

మరో గంట గడిచాక, ఆయన్ను వచ్చి చూడమన్నారు. నాలుగు అంగల్లో వెళ్లాడాయన భార్యను పలకరిస్తూనే పక్కన ఉయ్యాల్లో ఉన్న ఇద్దరు పిల్లల్నీ చూశాడాయన ఒక పిల్ల తెల్లగా చందనపు బొమ్మలా ఉన్నది ఒక పిల్ల కాస్త చాయ తక్కువ. ఆ యిద్దరు పిల్లల్నీ చూడంగానే ఆయనకు ప్రేమ, వాత్సల్యాలు కట్టలు తెంచుకుని వచ్చినయ్యి ఆనందబాష్పాలు కళ్లల్లో చిందులాడగా, ఆ పసిబిడ్డ కాళ్ళూ, చేతులూ పట్టుకు చూశాడు. ఆశ్చర్యంతో ఒక్కగంతువేసి,

"చూశావా రవణా, వదినా, మీరైనా చూడలేదా, ఈ చాయ తక్కువ పిల్లకు ఎడంచేతికి పైన మణికట్టుమీద ఎంత పెద్ద పుట్టుమచ్చో" అన్నాడు.

"అంతేకదా, మరేమిటో అనుకున్నాను. దానికి అంత ఆశ్చర్యమూ, ఖంగారూ ఎందుకూ" అన్నది. రవణమ్మ.

"అబ్బరంగా పుట్టిన పిల్లలకు ఆ కాస్త నల్లటి పుట్టుమచ్చ ఎందుకుండాలాని ఆయనగారి బాధ" అన్నది వదినెగారు.

ముగ్గురూ నవ్వుకున్నారు

"అయితే వదినా, నాకు తెలీటంలేదు అందులో పెద్దపిల్లెవరు, చిన్నపిల్లెవరూ. ఈ తేడా కనిపెట్టడం కష్టమే సుమా" అన్నాడు. మళ్లీ పిల్లల వైపు చూస్తూ.

"బావుంది మీ సందేహం. తెల్లగా ఉన్నది పెద్దపిల్ల ఇద్దరికీ ఇరవై అయిదు నిమిషాలు వ్యవధి" అన్నది వదినెగారు.

కాసేపు రవణమ్మతో మాట్లాడి ఆఫీసుకు వెళ్లాడాయన.

మర్నాడు టీపార్టీ ఘనంగా చేశాడు.

మానవజీవితానికి ఆశ, నిరాశలు దీర్ఘాయుష్మంతులైన ప్రియమిత్రు లయితే, సంతోష విచారాలూ అల్పాయుష్కులైన బిడ్డలలాంటివి. మానవ హృదయానికి ఆనందమూ, ఉత్సాహమూ చెలియలికట్టలాంటివి. ఈ దీర్ఘాయుష్మంతులైన ప్రియమిత్రుల ప్రోత్సాహంతో, అల్పాయుష్కులైన బిడ్డలను తీర్చిదిద్దాలనే ప్రేమభావంతో, ఆ చెలియలికట్ట మధ్యగా ప్రవహించే ఆలోచనాతరంగాలను చూస్తూ కూర్చుంటాడు. అట్లా కూర్చుని, ఆ పిల్లలతో, ఆ స్నేహితులతో, నురుగులతో తేలియాడే ఆ భావవాతరంగాలను చూస్తున్నప్పుడు ఇంక జీవితంలో తను సాధించలేని కార్యం లేదని భ్రమపడతాడు. కాని అది భ్రమని అప్పట్లో తెలియనే తెలియదు

రవణమ్మ పురిటి స్నానం పదకొండో రోజున జరిపించి ఎంతో వేడుకతో ఘనంగా బంధుమిత్రులను పిల్చి వేదోక్తంగా బారసాల జరిపించారు సుందర్రావు. వచ్చిన బంధువులంతా రవణమ్మని పరాచికంగా పరామర్శించారు "మేమంతా లోక రివాజుగా రెండు కాన్పుల్లో ఇద్దరు పిల్లల్ని కంటే, మాకన్న వెనకబడ్డ నువ్వు ఒక్క కాన్పుతోనే మాతో కలిశావు." అన్నారు. తృప్తిగా పిల్లల్ని చూస్తూ నవ్వింది రవణమ్మ. బారసాలకు వచ్చినవారంతా కొత్తబట్టలు కట్టుకునే వెళ్లారు. పురిటికి సహాయంచేసిన వదినెగారికి రెండువందల రూపాయల ఖరీదుగల కంచి పట్టుచీరె కొని రవణమ్మ చేత మనసారా చదివించాడు. మొత్తంమీద పురుడు, బారసాలకి పదిహేను వందలు ఖర్చయినయ్యి.

(సశేషం)



"వీలునామా" లో కృష్ణకుమారి.

## 25-6-1965 శుక్రవారం మొదలు 1-7-1965 గురువారం వరకు.

**మేషం :** భవిష్యత్తులో మీకు లాభించే వ్యవహారాల మీద మీరు దృష్టిని కేంద్రీకరించడంవలన ప్రస్తుతపు వ్యవహారాల్లో మీరు పొందవలసినంత ప్రయోజనాన్ని పొందలేని పరిస్థితి ఏర్పడుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందడంవలన అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించవచ్చును ఉద్యోగంలో యిదివరకు మీకు చికాకులు కలిగించిన వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. సాహిత్య కళా రంగాల్లో మీ అభిప్రాయాలకు తగిన అవకాశాలు లభిస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాల్లో ప్రముఖ పాత్రను నిర్వహించగలరు

**వృషభం :** వృత్తి వ్యాపారాల్లోమీ కార్యక్రమాలకు ఆటంకాలు వచ్చేటట్లు కన్పిస్తాయి గాని మీరు చాకచక్యంతో వ్యవహరించడంవలన వాటిని అధిగమించడమే కాకుండా తగినంత అభివృద్ధిని సాధించగలరు వారం ప్రారంభంలోనే కొన్ని వ్యవహారాల్లో అదిక వ్యయం జరగడంవలన ఆర్థికంగా కొంచెం యిబ్బంది కలుగుతుంది వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. కోర్టు వ్యవహారాలు యిదివరకటికంటే కొంచెం బాగా ఉంటాయి శుభకార్యాల విషయంలో మీకు బంధువుల సహకారం లభిస్తుంది ఆరోగ్యం బాగానే ఉంటుంది

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది సంతోషకరమైన వార్తలను వింటారు

**మిధునం :** ప్రతి వ్యవహారంలోను మీరు ఆదర్శప్రాయంగా ప్రవర్తించడానికి ప్రయత్నించడం వలన అనవసరమైన శ్రమకు గురికాగలరు. వ్యాపారంలో కొంతమంది వ్యక్తులు మీ మంచితనాన్ని తమ స్వార్థానికి వినియోగించుకోవడానికి ప్రయత్నిస్తారు. వృత్తి వ్యాపారాలు వారం ప్రారంభంలో కంటే వారాంతంలో అనుకూలంగా ఉంటాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. స్థిరాస్థి వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. కుటుంబ వ్యవరాల్లో యిదివరకు ఏర్పడిన భేదాభిప్రాయాలు తొలగిపోతాయి. అలంకార వస్తువులు కొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉన్నా, కొంచెం బలహీనం కన్పిస్తుంది ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది.

**కర్కాటకం :** వారం ప్రారంభంలో బాగానేఉన్నా వారాంతంలో కొన్ని చికాకులకు గురికావడంవలన వృత్తి వ్యాపారాల్లో మీరు సాధించిన అభివృద్ధి ఏమీ ఉండకపోవచ్చును మీరు స్వంతంగా చేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందకపోవడంవలన కొన్ని కార్యక్రమాలను వాయిదా వేయవలసి వస్తుంది.

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | వం | గు రా | ర బు |
| శ | వారఫలం | | శు |
| | మహేష్ | | |
| | కే | | కు |

వృత్తిలో ఆదాయం మామూలుగానే ఉన్నా, గౌరవం మాత్రం బాగా ఉంటుంది ప్రయాణాల్లో మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు నిరాటంకముగా నెరవేరతాయి బంధుమిత్రులను కల్సుకొంటారు.

**సింహం :** వృత్తి వ్యాపారాల్లో తాత్కాలికమైన ప్రయోజనాన్నే కాకుండా, భవిష్యత్తులో మీకు లాభించే వ్యవహారాల్లో అభివృద్ధిని కూడా సాధించగలరు. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభిస్తాయి. వృత్తిలో నూతనమార్గాల ద్వారా ఆదాయం పెరుగుతుంది ఉద్యోగంలో మీ అభిప్రాయాలను అమలుజరిపి అధికారుల గౌరవాన్ని పొందగలరు రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలు బలహీనపడే సంఘటనలు జరుగుతాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**కన్య :** గతవారం కంటే ఈవారం బాగాఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో యిదివరకు ఏవో కారణాలవలన ఆగిపోయిన వ్యవహారాలను యిప్పుడు పూర్తిచేయగలరు భారీయెత్తున చేసే వ్యాపారాల్లో కొంతమంది మిత్రుల సహకారంతో అభివృద్ధిని సాధించగలరు. ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగానే ఉంటాయి కాని, నూతన వ్యవహారాలు ప్రారంభించడానికి ఇది సమయంకాదు సాహిత్య కళా రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వారం ప్రారంభంలో బంధువుల వ్యవహారాల్లో ఆందోళన కలుగుతుంది. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా ఉంటాయి. ఎవరితోను మాట పట్టింపులకు దిగడం మంచిదికాదు

**తుల :** ఈవారం శుభాశుభమిశ్రమంగా ఉంటుంది. ప్రయత్నించిన పనులకు ఆటంకాలు రావడం, అనుకోని వ్యవహారాలు నెరవేరడం వంటి సంఘటనలు జరుగుతాయి. వ్యాపారంలో కొన్ని అవకాశాలు ఆకర్షణీయంగా కన్పించినా, అవి కార్యరూపాన్ని ధరించడం కష్టం. వృత్తిలో పోటీవారితో పోటీ పెరగడంవలన మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. ఉద్యోగంలో కార్యభారం పెరిగినా గౌరవం మాత్రం బాగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. వస్త్ర వ్యాపారులకు, కంట్రాక్టర్లకు మంచి సమయం

స్త్రీలకు—ఆరోగ్యం యిదివరకటికంటే బాగా ఉంటుంది. బంధువులకు సహాయం చేస్తారు.

### ఈ వారం ధరలు

అపరాల ధరలు వారం మధ్యలో తగ్గగల సూచనలు ఉన్నాయి. బెల్లం ధర కొంచెం పెరిగి నిలకడగా ఉంటుంది. చింతపండు ధర తగ్గవచ్చును. నూనె, నువ్వుల ధరలు కొంచెం తగ్గి మరల పెరుగుతాయి. బట్టల ధరలు చురుకుగా ఉంటాయి.

**వృశ్చికం ;** అన్ని వ్యవహారాలు పైకి ప్రశాంతంగానే ఉన్నట్లు కన్పిస్తాయి గాని మీరు ఏమాత్రం ఏమరుపాటుగా ఉన్నా, వృత్తి వ్యాపారాల్లో అవస్థ మీది అనుభవం మరొకరిది కాగల సూచనలు ఉన్నాయి సాహసముతో కూడిన వ్యవహారాల్లో యితరుల జోక్యంవల్ల నష్టం వస్తుంది. భారీ ఎత్తున చేసే వ్యాపారాల్లో చాలా శ్రమమీద స్వల్పాభివృద్ధిని సాధించగలరు. ఉద్యోగంలో వారం మధ్యలో ఆందోళన కలిగించే వార్తలను వింటారు. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల బలం పెరగగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సాంఘిక కార్యక్రమాలు బాగా ఉంటాయి.

**ధనుస్సు :** ఏవ్యవహారంలోను విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశంలేదు. వృత్తి వ్యాపారాల్లో సామాన్యమైన వ్యవహారాలకు కూడా వ్యయప్రయాసలకు గురికావలసి వస్తుంది కొన్ని వ్యవహారాల్లో ఎదుటివారిదే తప్పు అయినా, మీరే సర్దుకుపోవలసిన సమయం. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు మాత్రం కొంచెం బాగా ఉంటాయి. వృత్తిలో శ్రమమీద యధాతధ స్థితిని కాపాడుకొంటారు. ఉద్యోగంలో యితరులు చేసిన పొరబాట్లకు కూడా మీరే బాధ్యత వహించవలసి వస్తుంది. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సంతానానికి కించి దనారోగ్యం చేస్తుంది విలాస వస్తువులు కొంటారు.

**మకరం ;** గ్రహబలం అనుకూలంగా ఉంది. వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభించడంవలన అధికాదాయంతోపాటు భవిష్యత్తు మీద విశ్వాసం కూడా లభిస్తుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల కంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో పోటీవారి పోటీని ఎదుర్కొని విజయాన్ని సాధించగలరు. ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేయ

గలరు. అనవసరమైన వ్యవహారాల్లో చిక్కుకొనిటువంటి అమూల్యమైన కాలాన్ని వ్యర్థం చేసికొనే ప్రమాదం ఉంది

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా జరిగిపోతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం :** ఆదాయంమాట ఎలాగ ఉన్నా, వృత్తి వ్యాపారాల్లో మీరు కార్యసాధన కోసం కొంతమంది అవాంఛనీయులైన వ్యక్తులతో సన్నిహితంగా ప్రవర్తించడంవలన మీ మిత్రులే మిమ్మల్ని అపార్థం చేసుకొనే ప్రమాదం ఉంది. ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉన్నా, రావలసిన డబ్బుమీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. ఉద్యోగంలో పాటివారితో భేదాభిప్రాయాలు రాగల సూచనలున్నాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషికి ఆటంకాలు రావచ్చును. కుటుంబ వ్యవహారాల్లో చికాకులు వస్తాయి

స్త్రీలకు—వారాంతంలో ఆరోగ్యం అంత బాగా ఉండదు. పుణ్యకార్యాలు చేస్తారు. సంఘసేవికలకు మంచి సమయం

**మీనం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలకు అప్పుడప్పుడు స్వల్పాటంకాలు రావచ్చును గాని మొత్తంమీద ఈవారం సంతృప్తికరంగానే ఉంటుంది. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాలకు యిది వరకు ఏర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు అనుకొన్నంత ప్రోత్సాహ

కరంగా ఉండకపోవచ్చును. వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

## వారఫలం

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగానే ఉంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. అలంకారవస్తువులు కొంటారు. 

# జన్మదినఫలం

### జూన్-25

ఈ సంవత్సరం అంత బాగా ఉంటుందని ఆశించడానికి అవకాశంలేదు. కొన్ని వ్యవహారాలు సులువుగా నెరవేరినా, మరికొన్ని వ్యవహారాల్లో చాలా శ్రమకు గురికావలసి వస్తుంది. వ్యాపారంలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో ప్రయాసకు తగిన ప్రయోజనం ఉండకపోవచ్చును వృత్తిలో కొంచెం శ్రమమీద యధాతథ స్థితిని కాపాడుకొంటారు. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు రావచ్చును ఆరోగ్యం అంత బాగా ఉండదు. కుటుంబ వ్యవహారాల్లో ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది. విద్యార్థులు మొదటు నుంచీ శ్రద్ధగా చదవడం మంచిది.

### జూన్-26

ఈ సంవత్సరం వృత్తి వ్యాపారాల్లో, అప్పుడప్పుడు కొంచెం ఆందోళన కలిగినా, మొత్తం మీద ఆదాయం బాగా ఉంటుంది అధికారుల వలన జరగవలసిన వ్యవహారాల్లో యిదివరకు ఏర్పడిన ఆటంకాలు తొలగిపోతాయి మీకు అంతగా యిష్టం లేకపోయినా, మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసుకోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. తీర్థయాత్రలు చేస్తారు. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

### జూన్-27

ఈ సంవత్సరం అన్నివిధాలా ప్రోత్సాహకరంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీకు అనుకూలమైన మార్పులు వస్తాయి. ఇంతవరకు చికాకు కలిగించిన వ్యవహారాలు మీకు అనుకూలంగా పరిష్కారం కావడంవలన, ముఖ్యమైన వ్యవహారాల్లో దృష్టిని కేంద్రీకరించడానికి అవకాశం లభిస్తుంది వ్యాపార విస్తరణ ప్రయత్నాలు లాభదాయకంగా ఉంటాయి. వృత్తిలో నూతన మార్గాల ద్వారా ఆదాయం పెరుగుతుంది ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. ఆరోగ్యం సంవత్సరాంతంలో అంత బాగా ఉండదు. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. రాజకీయ నాయకులకు కంట్రాక్టర్లకు మంచి సమయం. విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు చాలా బాగుంటాయి.

### జూన్-28

సంవత్సరం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో వ్యయప్రయాసలకు గురి కావడంవలన, తరువాత కొంత అభివృద్ధి సాధించినా, మొత్తం మీద సంతృప్తికరంగా ఉండదు. వ్యాపారరీత్యా మీరు యిదివరలో జరిపిన వ్యవహారములవల్ల ఇప్పుడకి యిబ్బంది కలుగుతుంది వృత్తిలో కొత్తవారి పోటీని ఎదుర్కోవలసి ఉంటుంది. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహిస్తారు. సంవత్సరం రెండవ భాగంలో అన్ని వ్యవహారాల్లోను అనుకూల పరిస్థితి ఏర్పడుతుంది. ముఖ్యమైన వ్యవహారాలు అప్పటివరకు వాయిదా వేయడం మంచిది ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు వస్తాయి. విద్యార్థులు మొదటునుంచీ శ్రద్ధగా చదవడం అవసరం.

### జూన్-29

ఏ వ్యవహారంలోను విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశంలేదు. వృత్తి వ్యాపారాల్లో పరిశ్రమకు తగిన ప్రయోజనం లభిస్తుంది మీరు స్వంతంగా చేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. మున్ముందు మీకు లాభించగల వ్యవహారాల్లో యితరుల జోక్యంవలన ఆటంకాలు వస్తాయి సాహసముతో కూడిన వ్యవహారాల్లో సంవత్సరం ప్రారంభంలో నష్టం రావచ్చును. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. సాహిత్య కళారంగాలలో మీ కృషి అనుకొన్నంత బాగా ఉండకపోవచ్చును.

### జూన్-30

వృత్తి వ్యాపారాల్లో కొన్ని చికాకులు వచ్చేటట్లు కన్పిస్తాయి గాని మీరు సమయస్ఫూర్తితో వ్యవహరించడంవలన వాటిని అధిగమించడమే కాకుండా తగినంత అభివృద్ధిని సాధించగలరు వ్యాపారం భారీ యెత్తున చేయడంవలన ఆర్థికంగా ఒత్తిడి రాగలదు. రావలసిన డబ్బుమీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడంవలన మున్ముందు యిబ్బంది కలుగుతుంది వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. శుభకార్యాల విషయంలో మీ ఆలోచనలు ఫలిస్తాయి అలంకార వస్తువులు కొంటారు. విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు అనుకూలంగా ఉంటాయి.

### జూలై-1

ఆదాయం బాగానే ఉన్నా, కార్యసాధన కోసం వృత్తి వ్యాపారాల్లో మీకు అంతగా యిష్టంలేని వ్యక్తులతో సన్నిహితంగా ప్రవర్తించవలసిన పరిస్థితి ఏర్పడడంవలన ఈ సంవత్సరం అంత సంతృప్తికరంగా ఉండదు మీరు స్వంతంగా చేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో ప్రయోజనం కంటే ప్రయాస అధికంగా ఉంటుంది. వృత్తిలో కొన్ని అనవసరమైన వ్యవహారాల్లో చిక్కుకొనే ప్రమాదం ఉంది ఉద్యోగంలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు ఆరోగ్యం అంత బాగా ఉండదు. కుటుంబ సంతోషం లభిస్తుంది విద్యార్థులు చాలా శ్రమమీద కృతార్థులు కావచ్చును. 

"చిన్నటి గుఱ్ఱప్పందాల ప్రమాదంలో నాపేరు వొచ్చిందేమో కొద్దిగ చూచి చెప్పండి"



# ఆశలు - శాస్త్రాలు

యస్. వివేకానంద



"ఏమండోయి కవిగారు—!" అన్న పిలుపు వినిపించటంతో రోడ్డుమీద నడుస్తున్న శ్రీధరం ఓ క్షణం సేపు నిలబడి తాపీగా వెనక్కుతిరిగి చూచాడు.

"ఏరా గురూ! రోడ్డుమీద నడుస్తున్నప్పుడు కూడ అంత పరధ్యానమైతే యెట్లా?— అప్పటికే మూడు మార్లు గొంతు చించుకుని పిలిస్తేనే గాని పలక్కపోతివి." అంటూ గబగబా దగ్గరికివచ్చాడు భారవి.

"ఇంతకూ ఏమిటి విషయా" అన్నట్లు భారవి కళ్ళల్లోకి చూస్తున్న శ్రీధరాన్ని 'వరే అబ్బాయి అంతతొందరైతే యెట్లా?!—' అని భుజం తట్టి ప్రక్కనేవున్న హోటల్లోకి నడిపించాడు.

పాతికేళ్ళయినా పూర్తిగ నిండని శ్రీధరం పూర్తి పాతకాలపు ఛాందస కవిలాగ అవుపిస్తాడు పైకి. తనవేషధారణలోనే, వీడొక కవిగాబోలని అందరు అనుకోవాలని వాడి ఆశ—

బిస్కటు రంగు సిల్కులాల్చి, మధ్య పాపిటి, కళ్ళకు జోడు, భుజాలమీద వళ్ళెవాటుగా వ్రేలాడే కాఫీరంగు కాశ్మీరు శాలువ (చౌకరకంది), అదీవాడి అలంకారం. (కాని బి.సి. నాటి సంగీతం మాష్టారులావున్నాడని వాడికేం తెలుసు.)

శ్రీధరం అలంకారం ద్వారా ఒక కవిలాగు కన్పించటమేగాకుండా, పలుకరించిన ప్రతివాడితో తలనొప్పి పుట్టించే కేవలం గ్రాంధికం సంభాషిస్తాడు.

ఆనాటి శ్రీనాధుడెంత?— తిక్కనెంత? అనేశక్తి లేకపోయినా, ఛందస్సుతోగూడి, క్రమ బద్ధంగావుండే కాసిని పద్యాలు, బోలెడుగేయాలు వ్రాసాడు. కాని తనొక గొప్ప కవిలాగ ప్రస్తుత ఆంధ్రదేశంలో పరిగణింపబడి వన్నెకెక్కాలని, కక్కుర్తిపడే అలవాటు శ్రీధరంలో అంకురించింది. అదే బలీయమైన ఆశగా వాడిలో జీర్ణించుకు పోయింది.

కాలేజిలో చదివేరోజులనుండి, కన్పించిన తెల్లకాగితాన్నల్లా నలుపు చేయటం వాడి అలవాటు. ప్రతినోట్సులోను ఏ విరహ గీతమో, విలాపగేయమో కన్పిస్తుంది. ఖర్మం, వో గరల్ స్టూడెంటు యే విషయంగురించయినా పలుక రించటం జరిగితే "బాలామణీ! తమనామధేయం బెయ్యది? నన్నివిధంబుగ పలుకరించుటలో గల భావంబు విశదంబు చేయుడీ!!—" అంటు వెధవమొహం పెట్టేవాడు.

శ్రీధరం నిజానికి కాస్త కూస్త సాధన చేసి ఒక రచయిత కోవలోకి వచ్చాడనే చెప్పవచ్చు. కాని వాడు ఆశించినంతగా పత్రికా ప్రచురణల ద్వారా

వాడి రచనలకు ప్రోత్సాహం కన్పించక పోవడంతో, నిరుత్సాహ పడ్డాడనే చెప్పాలి.! అప్పటికి రచయితగ తనక్కావలసిన 'బైరాగి చిట్కాలన్నీ కరతలామలకం చేసుకున్నాడు— చివరకు తనొక 'నశీబు' లేని కవిని గాబోలని అప్పుడప్పుడు వాడిలో వాడు గొణుక్కుంటు వుంటాడు.

క్రొత్త కథ వ్రాసినప్పుడల్లా పదిమంది ఫ్రెండ్సును పోగుజేసి వినిపిస్తాడు. వద్దుమొర్రోని వచ్చిన వారంతా వాడికద వినేందుకు అభ్యంతరం చెప్పినా, వాళ్ళను కాఫీతో సత్కరించి, వలసిన వారికి 'ఆస్ప్రో' తెప్పించి మరీ విన్పించేవాడు ఇంతా చేసిన తరువాత 'నీకథ ఏడిసినట్టుంది! ఇలాటి రచనలు వ్రాయమని యెవరు ఏడిచార'ని అంటే శ్రీధరంగాడి మనస్సెక్కడ నొచ్చు కుంటుం దోనని "చాలా బావుందోయి నీకథ! అసలీమధ్య ఇలాంటి రచనలకే పత్రికలవారు ప్రోత్సాహం యిస్తున్నారు మామాటవిని ఏపోటీ కైనా పంపించు. ప్రథమ బహుమతి తప్పకుండ నీకే వస్తుంది!" అని వూరడించటంతో పొంగిపోయేవాడు

ఎక్కడో, యే గురుకులంలోనోపుట్టి, వున్నతో న్నత పరిమాణాలను అందుకోవలసిన శ్రీధరం, ఖర్మగాలి చివరకు గుమస్తాగిరి చేయాల్సివచ్చింది ఓరోజున వాడి రూమ్మేట్సుతో బాతాఖాని కొడుతూ నేటి రచనలను, రచయితలను విమర్శించి ఆ— ఏముందోయ్ ప్రతిరచయితా స్త్రీ పాత్రగాని, ప్రేమ సన్నివేశాలు గాని లేకుండా కథలే వ్రాయటం లేదు అసలు కొత్తపంథాలో వ్రాయాలంటే వాళ్ళ చేతనేమౌతుంది? అంటూ తన అక్కసు వెళ్ళబోశాడు మళ్ళాతన సహజ ధోరణిలో, వరే రావు! నిజానికి మనం చదివే ప్రతి కథలోను "సునందినిని సుబ్బారావు బస్స్టాండులో కలుసు కున్నాడు, అర్ధ రాత్రిపూట మెట్రిక్ చదివే మాష్టారమ్మాయి పక్కయింటి రవిగాడి అందం చూచి, వరించి గదిలో జొరబడ్డది, లేదా, వాసంతి మల్లెపూల పందిరి క్రింద పేపరు చదువుతూ పడు కుంటే, శేఖరం ముద్దెట్టుకో బోయాడు." అన్నీ యిలాంటి 'సిల్లీ' సన్నివేశాలే గదుటోయ్ అంటు వుక్రోషంతో మాట్లాడి కళ్ళల్లో నీరు నింపుకునేవాడు.

పాపం వాడి బేలహృదయానికి ఫ్రెండ్సు జాలిపడి ఓదారుస్తు 'వరే అబ్బాయ్! దేనికైనా కాలం కలసిరావాలోయ్. నువ్వు మాత్రం ఏం చేయగలవు చెప్పు?! నువ్వు వ్రాసే ప్రతికథలోను, గేయం లోను ఏదో కొత్తదనం వున్నా, పత్రికలవారిని ఆకట్టుకునే, ఆకర్షణీయమైన అసలు సిసలైన చమక్కు' లేవీ వారికి కన్పించటంలేదేమో! పాపం తిరుగు టపాలోనే రఫీమని నీ రచనలన్నీ తిరిగొస్తు న్నాయ్ ఎందుకైనామంచిది, గుండె ధైర్యం తెచ్చు కుని ఇలాగే 'ట్రయ్' చేస్తూవుండు. నీకూ ఓనాటికి 'స్టార్' తిరిగి గుడ్డేటున ఓ కథగాని, గేయంగాని పడటం జరిగితే నీకూ అదృష్టం తిరగవచ్చు! ఇక నువ్వు ఏ చెత్తరచన పంపినా పంపక పోయినా, 'మీ కథలను ప్రచురించవలసినదిగా పాఠకులనుండి జాబులొస్తున్నాయంటూ' పత్రికల వారే నీవెంట బడతారు!! అంటూ వారి అమూల్యమైన సలహా లతో శ్రీధరాన్ని ఓదార్చారు.

అసలీరోజుల్లో ప్రతివ్యక్తి లోను ఓవిచిత్రమైన మనస్తత్వం కన్పిస్తూవుంటుంది. తనొకరచయిత కావాలని, లేదా వెండితెరమీద తన ముఖం కన్పించాలని, కాకపోతే రేడియోద్వారా తన కంఠాన్ని శ్రోతలకు విన్పించి తను తరించాలనీ! ఈ మూడు కోరికలు బలీయంగా పీఠం వేసు కున్నాయి..

పైన చెప్పిన మూడురకాల్లో మొదటికోవకు చెందినవాడు శ్రీధరం వాడిని చూచిన ప్రతివాడు "వరేయి! ప్రఖ్యాత రచయిత!! మొన్న కథలపోటీలో బహుమతి గెల్చుకుంది వీడే! నిన్న సన్మానం జరి గిందికూడ ఈయనకే!!—" అని అనుకోవాలని, అక్కడితో యెక్కడలేని పేరు ప్రఖ్యాతులు వాడిని ఆకాశానికి తీసుకెళ్ళాలనీ, లేకపోతే వాడిని చూచిన ప్రతి అమ్మాయి ఆమెకై ఆమే చిరునవ్వుతో పలుకరిస్తు "మీ కథలెంత చమత్కారంగా వుంటా యండీ! మీ రచనలు నన్నెంతగానో ఆకర్షించాయి! మీ ఆటోగ్రాఫ్ గాని, ఫోటోగాని ఇస్తారా! నా ఆల్బమ్‌లో దాచుకుంటాను, మిమ్మల్నే ఆరాధిస్తాను ప్రేమిస్తాను." అనంటూ వాడిచుట్టు తిరిగి, వాడిని పొగిడేయాలని శ్రీధరం ఆశలు కాని వాడి ఆశలన్నీ హాస్యాస్పదమవుతున్నందుకు ఫ్రెండ్సంతా విచారిస్తుంటారు

ఇంతకు, అసలు విషయానికి వద్దాం! అలా హోటల్లోకి లాక్కెళ్ళిన శ్రీధరాన్ని, భారవి భారంగా బైటికి తీసుకొచ్చి, ఓ సిగరెట్టు కొని పెట్టి, "ఒరేయ్ శ్రీధరం! నీరూముకెళ్దాం పద!! అక్కడ తీరుబడిగ మాట్లాడు కోవచ్చు! ఇక్క డైతే పదిమంది వింటారు" అనటంతో ఇద్దరూ నడకవేగం హెచ్చించారు

అప్పటికి రాత్రి ఏడుగంటలవుతూంది రూము తాళం తీసి లోపలికి వచ్చి, లైటు వేశాడు శ్రీధరం. వాల్చివున్న ఈజీచైరులో భారవి కూర్చుంటూ ప్రక్కనే వున్న 'కాంపుకాటు' మీద కూర్చోనున్నాడు శ్రీధరాన్ని.

'ఇంతకూ ఏమిట్రా అసలు విషయం?' ఉండ బట్టలేక అడిగాడు శ్రీధరం. 'ఆగవోయ్! కాస్సేపు తిన్నగ నన్ను వూపిరి పీల్చుకోని! నీవెధవ గదిలోకి కనీసం మంచి గాలి అయినారాదు' అంటూ తాపీగా సిగరెట్టు ముట్టించాడు.

శ్రీధరంలో ఆతృత యెక్కువగా నారంభించిది. ఏం చెబుతాడనే ఆపేక్షతో భారవి ముఖంలోకి కళ్ళార్పకుండా చూస్తున్నాడు, ఆశగా!

"ఒరేయి శీధరం! అసలు విషయం ఇది ఎవ్వరితోను అనకు నీలోనే వుంచుకో! మేమంతా అనుకున్న ప్రకారం ప్లాను నిర్విఘ్నంగ జరిగితే నీవదృష్టవంతుడివై పోతావు ఒక్కుమ్మడిగా నీపేరు ఆచంద్రతారార్కం చిరస్థాయిగ ప్రతి పేపర్లో పెద్ద అక్షరాల్లో నిలిచిపోతుంది. ఎలాగయినా నిన్నూ, నీ గొప్పదనాన్ని పదిమందిలోకి తీసుకువచ్చి, నిన్ను ఒక కవిగా అందరికీ ఎరిగించాలని ఫ్రెండ్సంతా కలసి తాపత్రయపడి ప్లానొకటి వేశాం!— కాని నా 'రిక్వెస్టు' వక్కటే. మేం చేయబోయే ప్రతిపనికి తలూపి సరేనను. అంతే గాని వెధవ అడ్డ ప్రశ్నలువేసి మా ప్రాణం తియ్యొద్దు!" అని చెప్పుకు పోతున్న భారవి ధోరణి చూచి విసుక్కున్నాడు శ్రీధరం.

పూర్తిగా చెప్పనివ్వకుండా మధ్యలో అడ్డొస్తూ "ఏమిటోయి నీసోది? — అసలు సంగతేమిటో చెప్పరా తండ్రీ చంపక!" అంటూ బుంగమూతి పెట్టాడు.

శ్రీధరం అవస్థచూచి జాలిపడ్డ భారవి "ఒరే కవీ! నీకు కలసి వచ్చేకాలం ఆసన్నమవుతున్నదిరా! ఆ తర్వాత మేం నీకు కన్పిస్తామాని, నా అనుమానం"

"భారవీ! నీతల తిరుగుడు మాటలతో నాకు నిజంగ తల భారం వస్తోందిరా!! కొంపదీసి ఇంతకు నాకథేదైనా, నాకు తెలియకుండానే, ఏ పత్రిక లోనైనా ప్రచురింపబడటం జరిగిందా? — నిజం చెప్పరా సస్పెన్సులో పెట్టిచంపక! బాబ్బా—బు!" అంటూ తనలో వున్న అమాయకత్వాన్ని వెళ్ల బుచ్చాడు.

"ఓరి వెర్రిపీనుగా! నీకు అంతటిఅదృష్టం పడితే లేనిదేముంది? మా అందరి బాధగూడ అలాంటి ఛాన్సులే నీకు త్వరలో రావాలనీ, ఆంధ్ర పాఠకలోకానికి నువ్వు ఒక రచయితగా పరిచయం కాబడాలనే!!" అంటూ ఫ్రేము కట్టించిన ఒక సన్మాన పత్రంలాంటిది శ్రీధరానికి అందించాడు. అమాంతంగా దాన్ని చేతిలోకి లాక్కుని ఆత్రంతో చదివాడు పెద్దపెట్టున నవ్వాడు చిన్న కూని రాగం తీశాడు కంటిలో ఆనందాశ్రువులు కదం తొక్కినయ్

శ్రీధరం పరిస్థితి అయోమయమైంది ఎట్టలేచి ఆనందాన్ని ఆపుకుంటూ "ఒరే భారవీ! నీ తెలివి చాలా అమోఘంరా!! కానీ నాకో చిన్న సందేహం.. నాకు రేపు మీరు చేయబోయే సన్మానిక అసలెవరైనా జనం వస్తారా??—"

"ఒరే చిట్టితండ్రీ! నేననుకుంటున్న చొప్పదంటు ప్రశ్నే వేశావు! శుభం పలుకరా మంకెన్నా అంటే యెవడో యేదో కూశాడుట అట్లావుంది నీ ప్రశ్న! ఈ సన్మానపత్రం నీకు సమర్పించటంలో అసలు రహస్యం యిది! జాగ్రత్తగావిను ఒకవేళ నీగుండె ఆగి పోతుందేమో! యెందుకైనా మంచిది మనస్సుకుదట బరుచుకుని మరీవిను— పదిరూపాయలు అప్పు చేసి అందరం కలిసి సన్మాన పత్రాలువేయించాం! ముందుగానే ఊరంతా పంచిపెట్టాం! అంటే; నీకు సన్మానం జరిగినట్టే— ఇదంతా కేవలం పబ్లిసిటీ స్టంటు— లేకపోతే నీకు సన్మానమేమిటిరా! నా మొహం... చివరకు ఇప్పుడు జరుగబోయేది మాత్రం, సింపుల్‌గా నలుగురం కలిసి ఫోటో స్టూడియోకి వెళ్ళి కుర్చీల్లో కూర్చుని, నీమెడలో పూలదండ వేస్తున్నట్టు, నీకో సన్మాన పత్రం సమర్పిస్తున్నట్టు ఫోటో తీయించి పేపరుకు పంపిస్తాం! స్థానిక స్వవిలేఖరి యెట్లాగు మన వాడే గాబట్టి, నీ ప్రతిభను గురించి దంచిపారేస్తూ పొతికలైన్లు వ్రాస్తాడు. ఆదెబ్బతో నీకు సుడీ తిరుగుతుంది.— నిదురరదా అణుగుతుంది" అని అసలు రహస్యం వెలిబుచ్చాడు భారవి.

నిరుత్సాహంతో గుడ్లు తేలవేసిన శ్రీధరం వువ్వెత్తున లేచిన వాడల్లా చప్పగ చల్లారి పోయి, మూర్ఛ వచ్చిన వాడల్లే పెద్దకేకేసి అమాంతం 'కాంపు కాటు' మీద వళ్ళుతెలియ కుండ పడిపోయాడు.

భారవి మంచినీటి కూజా కోసం గది నాలుగు మూలలు వెతక వారంభించాడు. 

# మౌల్వీ నసిరుద్దీన్ -కథలు

*మహీధర్ నళినీ మోహన్




తైమూర్ వద్ద చాలా యుద్ధపు ఏనుగలు వుండేవి. ఆయన ఒక్కొక్క ఏనుగని ఒక్కొక్క వూరికి తోలించి వాళ్ళని ఆ ఏనుగుని మేపమనేవాడు. దానికే ప్రమాదము వచ్చినా ఆ వూరి వాళ్ళ ప్రాణాలు దక్కవు. అది పొలాలూ, తోటలూ పాడుచేసినా నోరుమూసుకొని దానికి ఏ లోటూ రాకుండా మేపాలి.

ఓ మారు మౌల్వీ నసిరుద్దీన్ వున్న వూరికి తైమూర్ ఓ ఏనుగుని తోలించేడు. కొద్ది రోజులలోనే వూళ్ళో పచ్చదనం అన్నది కనిపించకుండా అది తినేసింది. ఇంక దానిని మేపడం ఒక సమస్య అయింది.

చివరికి వూళ్ళో కాస్త పచ్చగా వున్న పెద్ద రైతులు నలుగురూ ఆలోచించేరు. తలపట్లు పట్టేరు. తైమూరుగారి దగ్గరికి వెళ్ళాలి. ఆయనతో చెప్పుకొని ఏడ్చి, ఏలాగైనా ఆ ఏనుగుని వదిలించుకోవాలనుకొన్నారు.

సరే బాగానే వుంది. కాని,

"ఎవరు వెళ్ళడం ?"

తైమూరు ఎదుట నిలబడి ఏడవడానికేనా ధైర్యం వుండాలి. ఆయనతో తమగోడు చెప్పగలగాలి. అయితే ఆ ధైర్యం ఒక్కరికీ లేదు. మళ్ళీ ఆలోచించేరు...ఎవర్ని పంపడం ?

చివరకు అందరూ వెళ్ళి రాయబారం నడపమని మౌల్వీ నసిరుద్దీన్‌ను బ్రతిమాలేరు.

మౌల్వీకి ఈపని ఇష్టంలేదు. అయితే అందరూ పొగిడి, బ్రతిమిలాడి, మొహమాట పెట్టేసరికి, ఏమీ చెయ్యలేక సరే నన్నాడు. అయితే ఒక్క షరతు ఉందన్నాడు...

"మీరంతా నాతో రావాలి. నా వెనక ఉండాలి."

"ఓ. దానికేముంది ?"—అన్నా రంతా, ఏక కంఠంతో.

అందరూ పట్నం బయలుదేరేరు రాజభవనం గుమ్మంలో నున్న దర్వాన్‌ను బ్రతిమిలాడుకొని ఎలాగో లోపలికి చేరుకొన్నారు. వాళ్ళు రాకపూర్వమే వాళ్ల లాగే అటువంటి పనిమీదే వచ్చిన ఇరుగు పొరుగు ఊరి వాళ్లు కొందరు కనిపించారు

వాళ్లకన్న ఒక పెడగా నిలబడి మౌల్వీ తన వంతు కోసం ఎదురు చూస్తున్నాడు

తైమూరు ఫిర్యాదులు ఆలకించడం ప్రారంభించేడు. తనకు ఆ ఫిర్యాదు నచ్చనప్పుడు వాళ్ల మీద అగ్గిరాముడై పోతున్నాడు వాళ్లని జైళ్లలో పారెయ్యమంటున్నాడు.

అది చూసేసరికి మౌల్వీని ముందు పెట్టుకు వచ్చిన వాళ్లకి పై ప్రాణాలు పైనే పోయాయి. ఆ ఆసామీలు హడలిపోయి, ఎవరికి వాళ్ళే చల్లగా జారుకున్నారు కొంతసేపు పోయేక మౌల్వీ వెనక తిరిగి చూస్తే అక్క డెవరున్నారు ? ఆఖరివాడు తానే తన వెనక వాళ్లు ఎప్పుడో జారుకున్నారు. ఇంక తా నెందుకు ? తానూ పారిపోదా మనుకున్నాడు

కాని ఇంతలో ఆతని వంతు వచ్చేసింది తైమూర్ మౌల్వీ ప్రయత్నం చూసి పిలిచేడు

"ఎక్కడికి పోతున్నావు ? ఏం పనిమీద వచ్చేవు ?"—అని అడిగేసేడు.

మౌల్వీ గుక్కిళ్లు మింగుతూ, నత్తులు కొట్టేడు.

"దేవర వెయ్యేళ్లు వర్ధిల్లాలి. మేము దేవర గులామువాళ్లం. తమ దయవల్ల సుఖంగా బతుకుతున్నాం. ఎప్పుడూ ప్రభువులు చల్లగా ఉండాలని అల్లాకు మొక్కుతూంటాం.."

తైమూరు ఆ పొగడ్తకి సంతోషించేడు ....

"బాగుంది. బాగుంది"

"ఈ ఏడు ప్రభువులు మా వూరికి తమ ఏనుగులలో ఒకదానిని పంపించారు అది చాలా చాలా మంచిదీ, తెలివైనదీను. ఆ ఏనుగుకి ప్రభువులు చక్కని తరిఫీదు ఇప్పించేరు దాని అండన మేమూ, మా పైరులూ ఎంతో సుఖంగా ఉంటున్నాము అటువంటి ఏనుగుని మావూరికి పంపినందుకు మే మందరం సర్వదా ప్రభువు వారికి కృతజ్ఞులముగా ఉంటాం. కాని, పాపం ఆ ఏనుగ మా ఊళ్లో ఒంటరిదై పోయింది ఏమీ తోచదు కాబోలు, పాపం రాత్రిళ్లు నిద్రపోదు ఊహూ అరుస్తుంది మా వూరివాళ్లు తమ సన్నిధికి వెళ్లి, మాట్లాడి ఆ ఏనుగుకి తోడుగా మరొక ఏనుగుని పంపించవలసిందిగా ఏర్పాట్లు చేయమన్నారు"

తైమూరికి ఆ కోరిక బాగా నచ్చింది మౌల్వీకి ఒక రూపాయి బహుమానం ఇచ్చేడు వాళ్ల వారికి ఒక ఆడ ఏనుగుని పంపించమని ఆజ్ఞ చేసేడు.

మౌల్వీ సభనుంచి వచ్చేసరికి వాకిట్లో వాళ్ల వూరివారంతా చుట్టు ముట్టారు.

"ఏమయింది ? ప్రభువు..."

మౌల్వీ తన చేతిలోని రూపాయి చూపించేడు—"ప్రభువువారు చాల సంతోషించి ఇది బహుమానమిచ్చేరు"

వాళ్ల ఆనందానికి పట్ట పగ్గాలు లేకపోయేయి. ఆయనని ప్రశ్నలతో ముంచి ఎత్తేరు ?

"ఆయన సరిగ్గా ఏమన్నారు ? ఒప్పుకున్నారా? కోపం రాలేదా ?"

"ఒప్పుకున్నారు నేను చెప్తూంటే ఒప్పుకోవడానికి సందేహం ఏం ఉంటుంది ? మీరంటే నమ్ముకుని వచ్చినందుకు వదిలేసి పారిపోయి వచ్చేరుగాని."

వాళ్ళంతా తాము చేసిన పనికి సిగ్గుపడ్డారు. అప్పుడు చెప్పాడు మౌల్వీ, అసలు రాజుగారు ఒప్పుకొన్న దేమిటో.

"రేపు తెల్లవారేసరికి ఓ ఆడఏనుగుని మన ఊళ్లో ఉన్నదానికి తోడుగాపంపిస్తా మన్నారు."★




# వృక్షవృత్తాంతం

— లతిక...

ముందు సామెతలు చెప్పుకుందాం. సభ్య దేశాల మధ్య అసభ్యదేశా లుంటే వాటిని తులసి వనంలో గంజాయి మొక్క లంటారు. హోదాని బట్టే ఖర్చు వెచ్చాలుండాలని చెప్పడానికి ఎంత చెట్టుకి అంత గాలి అంటారు స్కాలర్ లేని చోట ప్యాసు మార్కులవాడే గొప్పవా డనడానికి, మ్రాను లేని దేశమందాముదవు చెట్టే మహా వృక్షం అని ఉదహరిస్తారు. పార్టీ స్థాపకుల పేర్లు చెప్పుకుని వోట్లు అర్థిస్తే, చెట్టు పేరు చెప్పుకుని కాయ లమ్ముకోడంగా పరిగణిస్తారు.

ఇలా మన దైనందిన వ్యవహారాల్లో చెట్టు, పాదుకొల్పబడి, వేళ్లు తన్నుకుని, శాఖలుగా విస్తరించి తన ప్రాముఖ్యతని వెల్లడించుకుంటున్నది.

వృక్ష వృత్తాంతం అంటూ సాముదాయిక నామధేయం పెట్టాను గనుక చెట్ల గురించి స్థూలంగా మనవిచేస్తాను. (సూక్ష్మపరిశీలన ప్రారంభిస్తే చెట్టుకో వ్యాసం తయారౌతుంది!')

పరమసాధ్వి సీత పద్నాలుగేళ్లు గాలి పీల్చి గడిపింది, అశోకవృక్షం క్రింద! భీష్మ డంతటి మహారథి రథకేతనమైంది తాళధ్వజం! దానిపేరిట అతడు తాళధ్వజుడైనాడు. "వృక్షాలలో అశ్వత్థాన్ని నేను" అన్నాడు గీతాకారుడు కాని అశ్వత్థం త్రిమూర్తులకే ప్రాతినిధ్యం వహించిందని క్రింది శ్లోకం ఋజువుచేస్తుంది

"మూలతో బ్రహ్మరూపాయ
మధ్యతే విష్ణురూపిణే
అగ్రత శ్శివ రూపాయ .. "

దేవతలకే ప్రాతినిధ్యం వహించిన చెట్లు మానవులకు మహిమ లిచ్చేయి. గౌతముని, మునిగా, గౌతమబుద్ధునిగా మార్చింది బోధి వృక్షం! అజ్ఞాతవాస ప్రయాణం "మోర్ కంఫర్టబుల్" గా ఉండాలని 'లెస్ లగేజ్" తో ట్రావెల్ చేసిన పాండవులు, తమ ఆయుధాలు దాచుకుందికి క్లోక్ రూముగా ఉపయోగపడింది శమీవృక్షం!

క్రూరమృగాల బారినుంచి రక్షణకోసం చెట్టు నాశ్రయించాడు మానవుడు. అలా చెట్టెక్కడంలో వోసారి వో గమ్మత్తు జరిగింది. ఆ గమ్మత్తు యావత్తు యిది!

వేటకి వెళ్లిన భోజరాజు కొడుకు దారి తప్పేడు. పులి ఎదురైంది. పరివారం దూరమైంది. భయం చేరువైంది. చెట్టెక్కాడు. దానిమీదో ఎలుగుబంటి ఉంది. ముందు నుయ్యి, వెనక గొయ్యి. రాత్రి కావొస్తోంది. నిద్ర ముంచుకొస్తోంది. నిద్ర పడితే, నిద్రలో క్రింద పడితే, పడి పులివాత బడితే, నిద్ర దీర్ఘనిద్ర అవుతుంది. ఎలుగుబంటీ, రాజా కొడుకూ ఒడంబడికలు చేసుకున్నారు.

పడుకున్నవాళ్లు పడిపోకుండా రెండవవాళ్లు కాపుండాలని. రాజుకొడుకు పడుకున్నాడు. నిద్ర లేచాడు తన వంతు ప్రకారం ఎలుగు పడుకుంది. దాన్ని కిందకి తోసేస్తే తన మానాన తను పోతానని పులి పలికింది. రాజుకొడుకు ఎలుగును త్రోసి వేయబోయాడు. కాని అది పడలేదు. శపించింది. రా కొ తన వాఙ్మయం మరిచిపోయి ససేమిరా అన సాగేడు .... .... అక్షరానికో శ్లోకంగా నాలుగ్గు శ్లోకాలు చదివి, అక్షర లక్షలు పుచ్చుకుని ససేమిరా మాన్పించాడు మహాకవి కాళిదాసు!

ఆ కాళిదాసే పూర్వాశ్రమంలో కూర్చున్న కొమ్మ నరుక్కున్న ప్రబుద్ధుడు. అజ్ఞానంచేత అతను కూర్చున్న కొమ్మ నరికితే, ఆగ్రహావేశాతిశయంచేత ఒక మహావృక్షాన్ని సమూలంగా పెళ్లగించాడు సమీర కుమారుడు భీముడు!

పరిక్షించి పరికిద్దాం (వెయిట్ అండ్ సీ)అన్న ధర్మజాని సిద్ధాంతంమీద అతనికి నమ్మకం లేదు. (పెరటిచెట్టు మందుకి పనికిరాదుకదా!) కీచకుడు, చైనా, పాక్‌లు మంచి మాటలతో లొంగరని, వాళ్ల దురాక్రమణ ఆదిలోనే అరికట్టాలని, మొక్కయి వంగనిది మ్రానయి వంగదనీ అతనికి బాగా తెలుసు. కాని, అతని ప్రతీకార ప్రయత్నం వెంటనే ఫలించనివ్వలేదు ధర్మరాజు తాత్కాలికంగా భీముని ఉద్ధతి చెట్టెక్కింది' చేసినపని నెరవేరితే 'ఫలించడ' మనీ, కాకపోతే 'చెట్టెక్కడ' మని అనడం మీరు వినే ఉంటారు.

చెట్టెక్కడం అన్న ప్రయోగం ఎలా పుట్టిందో తెలుసా? బేతాళ పంచవింశతి చదవండి. బేతాళుడు ఇరవైనాలుగు కథలు చెప్పి, కథకో ధర్మసందేహం అడిగేవాడు. విక్రమార్కుడు చెప్పేవాడు. మౌనభంగం కాగానే బేతాళుడు చెట్టెక్కేవాడు. అలా విక్రమార్కుడు పన్నెండు మార్చిలు, పన్నెండు సెప్టెంబరులు చూశాడు. ఇరవై అయిదోసారి 'చెట్టు ముందా, విత్తు ముందా' లాటి ఆద్యంతాలు తెలీని ప్రశ్న వేశాడు బేతాళుడు విక్రమార్కుడు మౌనం వహించాడు. రిజల్ట్సు పేపర్లో వేశారు. అందులో విక్రమార్కుడి నెంబరు ఉంది, (ఉత్తీర్ణులైనవారి జాబితాలో!)

కాలేజీలు తెరిచేలోగా విక్రమార్కుడు చెట్ల గురించి రిసెర్చి చేశాడు. రామాయణం, భారతం, భాగవతం కల్పవృక్షాలని, వాటి ఛాప్టర్స్‌ని క్రమంగా కాండలని, పర్వాలనీ, స్కంధాలనీ వృక్షభాగాల పేరిట పేర్కొన్నారని తెలుసుకున్నాడు.

చిన్నయసూరి సాహిత్యం చదివి నోట్సు రాసుకున్నాడు, ప్రపంచం వృక్షమే అయినా, మంచివాళ్ల చెలిమి, మంచి పుస్తకాల కలిమి అమృత ఫలద్వయమని తెలుసుకుని,

"విషభరితమైన సంసార వృక్షమునకు
వెలసె మధుర సుధాతుల్య ఫలయుగమ్ము,
ప్రముఖ కావ్యామృతపు రసపాన మొకటి
సార్థకమ్మగు సజ్జన సంగ మొకటి."

—అని, పద్యంగా నోట్ చేసుకున్నాడు!

తరు పరిశోధన వ్యాసాలకి అతనికి డాక్టరేట్ యిస్తే, ఆ వ్యాసాంశాలు పత్రికలు సీరియల్‌గా ప్రచురిస్తాయి. తక్కిన విశేషాలు అప్పుడు తెలుసుకుందాం!



# పెప్సోడెంట్ యొక్క ఇరియమ్ ప్లస్

## మీ పళ్లను శుభ్రపరచి మెరిసేలా తెల్లగా చేస్తుంది

ఎలాగో చూడండి : పెప్సోడెంట్‌లో మాత్రమే అద్భుతమైన నురుగును యిచ్చే శాస్త్రపద్ధతిలో తయారైన ఇరియమ్ ప్లస్ చేర్చబడినది. ఈ అద్భుతమైన నురుగు సమృద్ధిగా కలిగి మీ నోటిలో అన్ని మూలలకు చేరి పళ్లను శుభ్రముగా, చల్లగా, పెప్పర్‌మింట్ రుచితో ఉంచుతుంది. అంతేకాదు, మీ పళ్లను మెరిసేలా తెల్లగా చేయుటకు ఇరియమ్ ప్లస్‌కు తెల్లదనమునిచ్చే ప్రత్యేకమైన శక్తికూడ ఉంది.




హిందూస్తాన్ లీవర్
లిమిటెడ్ వారి
ఒక విశిష్టమైన తయారు

JWT HDL-3636




BZ/BBC-7C TEI

## ఉత్సాహం, ఉల్లాసం కలిగించేది అంటేనే కాఫీ, దానిలో ఎన్నుకునేది

# బ్రూక్ బాండ్ కాఫీ

ఇతరమైన వాటికంటే బ్రూక్ బాండ్ విశేషమైనదనడానికి కారణాలేమిట? బ్రూక్ బాండ్ కాఫీ పొడి పొట్లం విప్పండి. మీకే తెలుస్తుంది. కాఫీ విత్తులను అప్పటికప్పుడే వేయించి తయారుచేసినట్టి కమ్మని మంచివాసన వేస్తుంది.

ఏరికోరి కూర్చిన మేలిరకం కాఫీ విత్తులే బ్రూక్ బాండ్ కాఫీ పొడి తయారీలో ఉపయోగించబడుతున్నవి. .తర్వాత ఆ కమ్మని వాసన తగ్గకుండా గాలి చొరని పెలిఫోన్ సంచులలో శాస్త్రీయ పద్ధతులపై ప్యాక్ చేయబడుతుంది. అప్పుడే బ్రూక్ బాండ్ కాఫీని ప్రారంభించండి ...ఆ తాజా, కమ్మని వాసనే శాశ్వతం చేసుకోండి.

---

మీరూ, బ్రూక్ బాండ్ కలిసి కప్పు మంచి కాఫీ తయారు చేయగలరు. ఎల్లప్పుడూ తాజాగావుండి కమ్మనివాసన కలిగి ఉండేదానిని రుచిచూడండి.

# వేల్పులకైనా మార్పులు తప్పవు

మహేష్

హిరణ్యకశ్యపుడు, రావణుడు మొదలైన రాక్షసులు త్రిలోకాధిపతి అయిన యింద్రుని వోడించి అతనిని రాజ్యభ్రష్టునిగా చేయగా, తరువాత విష్ణువో, ఈశ్వరుడో ఏదో ఒక విధంగా ఆ రాక్షసుని చంపి తిరిగి యింద్రునికి తన స్థానాన్ని యిచ్చినట్లుగా అనేక పురాణాల్లో చెప్పబడింది. రాక్షసులవలన యింద్రుడు రాజ్యాన్ని కోల్పోవడం కేవలం తాత్కాలికమైనదే కాగా, ఈశ్వరుడు, విష్ణువు మొదలైన పౌరాణిక దేవతల విజృంభణ వలన ఇంద్రుడు తన ప్రాముఖ్యతను శాశ్వతంగా కోల్పోయేడు. రాక్షసులవలన ఇంద్రుడు పొందిన కష్టనష్టాలకు తగిన చారిత్రక సాక్ష్యం లేదు కాని, ఈశ్వరుడు, విష్ణువు, శక్తి మొదలైన పౌరాణిక దేవతలు రంగంమీద ప్రవేశించేసరికి వేదాల్లో అత్యంత ప్రాముఖ్యతను వహించిన ఇంద్రుడు తెర వెనుకకు వెళ్లిపోయినట్లుగా చాలా సాక్ష్యం ఉంది. ఆయా దేవతలను ప్రార్థిస్తున్నట్లుగా మాత్రమే యింద్రుడు తిరిగి మనకు కనబడతాడు.

ఇంద్రుడు అనే పదం జరతుష్ట్ర మతగ్రంథమైన అవస్థాలో కూడా ప్రయోగింపబడింది. అందులో యిది ఒక రాక్షసుని పేరుగా వాడబడింది. ఇంద్రునికి పర్యాయపదాలుగా వాడబడుతున్న వృత్రహన్ వృత్రఘ్న అనే పదాల పోలిక గల "వెరెత్రఘ్న" అనే పదం కూడా అందులో ఉంది. ఈ పదానికి అర్థం విజయదేవత అందుచేత ఆర్యుల భారత వర్షాగమనానికి పూర్వమే వారికి ఇంద్రుని గురించి తెలియునని కొందరి అభిప్రాయం.

ఋగ్వేదంలో యింద్రుడు అత్యంత ప్రాముఖ్యతను వహించేడు. ఋగ్వేదంలో రమారమి నాలుగవ వంతు యింద్రుడి వరంగానే చెప్పబడింది. వైదికార్యులకు యింద్రుడు జాతీయ దేవత అని చెప్పవచ్చును. వేదాల్లో ఇంద్రుడు ముఖ్యంగా వర్షాధిదేవతగా కొనియాడబడినాడు. అనావృష్టిని చీకటిని తొలగించి జనులకు జలమును కాంతిని ప్రసాదించుచున్నాడు తరువాత ఆర్యానార్య సంఘర్షణలో ఆర్యులకు ఇంద్రుడు తోడ్పడుచున్నట్లుగా కీర్తింపబడ్డాడు.

ఇతని శరీరం విశేషంగా వర్ణింపబడింది ఇతడు కపిలవర్ణుడు, కపిలకేశములు కలిగినవాడు. విశేషించి యింద్రుడు సోమపాన ప్రియుడు సోమరసం యితనికి యుద్ధోత్సాహాన్ని కలిగిస్తుంది వృత్రాసురుని సంహరించడానికి ముందు ఇంద్రుడు మూడు చెరువుల సోమరసాన్ని త్రాగినట్లు వర్ణించబడింది.

ఇతని ప్రధానాయుధం వజ్రం. పిడుగే వజ్రాయుధంగా వర్ణించబడిందని వూహించబడుతుంది. వజ్రాన్ని త్వష్ట నిర్మించినాడు ఇంద్రుడు ధనుర్బాణాలను అంకుశాన్ని ధరించినట్లు కూడా అక్కడక్కడ చెప్పబడింది స్వర్ణమయమైన యితని రథాన్ని రెండు గుర్రాలు లాగుతుంటాయి.

ఇతని తండ్రి ద్యౌస్ అని కొన్నిచోట్ల, త్వష్ట అని కొన్నిచోట్ల చెప్పబడింది. అగ్ని యితని సోదరుడు. పూషన్ కూడా యితని సోదరుడేనని కొందరి అభిప్రాయం. ఇతని భార్య ఇంద్రాణి. మరుత్తులు యితని ముఖ్య అనుచరులు. అందుచేతనే ఇంద్రునకు మరుత్వంతుడు అనే పేరు వచ్చింది. వరుణుడు, అగ్ని, వాయువు, మొదలైన దేవతలతో కలిపి యింద్రుడు తరుచుగా స్తుతించబడినాడు. ఇతడు తన తండ్రియైన త్వష్టను చంపినట్లు కూడా చెప్పబడింది.

అనావృష్టి కారకుడైన వృత్రాసురునితో యింద్రుడు జరిపిన పోరాటం విశేషంగా వర్ణించబడింది. ఈ వృత్రాసురుడే అహి అని కూడా పేర్కొనబడినాడు. సోమపానము చేసిన ఇంద్రుడు మరుత్తులతో కూడి వృత్రాసురునితో పోరినాడు ఈ యుద్ధసమయంలో భూమ్యాకాశాలు కంపించినాయి జలములను బంధించిన వృత్రాసురుని, ఇంద్రుడు తన వజ్రాయుధముచే భేదించి జలములను విడిపించినాడు. జలవంతములైన మేఘములు కొన్నిచోట్ల పర్వతములుగాను మరికొన్నిచోట్ల పురములుగాను వర్ణింపబడ్డాయి. అందుచేతనే ఇంద్రునకు పురందరుడనే పేరు వచ్చినది. అనార్యుల పురాల్ని ధ్వంసం చేయడంవలన ఇంద్రుడికి ఈ పేరు వచ్చిందని కొంతమంది ఆధునికుల అభిప్రాయం ఇంద్రుడిచేత ధ్వంసం చేయబడిన పట్టణాలు మహెంజోదారో, హరప్పాలే నని కూడా వీరి అభిప్రాయం. కాని, దీనిని బలపరిచే సాక్ష్యం అంతగా లేదు.

వృత్రాసురుని వధించిన అనంతరం ఇంద్రుడు సూర్యుని కనుగొన్నట్లుగా వర్ణించబడింది. ఇంద్రుడే సూర్యుని ఆకాశమందుంచినాడు. ఉత్తరధ్రువ ప్రాంతమందున్న దీర్ఘరాత్రులే ఇటువంటి వర్ణనకు కారణం అని తిలక్ పండితుని అభిప్రాయం. ఈ అభిప్రాయమే ఆర్యుల ఉత్తరధ్రువ ప్రాంత నివాస సిద్ధాంతానికి దారితీసింది.

ఇంద్రుడు కదలుచున్న పర్వతాలను నిలిపినట్లుగా కూడా వర్ణించబడింది. ఈ వర్ణనే పురాణాల్లో ఇంద్రుడు పర్వతాల రెక్కలను ఖండించినట్లు చెప్పే కథలకు కారణమైంది. వేదకాలంలో ప్రకృతిశక్తినే యింద్రునిగా వూహించేరు కాని పురాణ కాలానికి రకరకాల కథలు ప్రచారంలోకి వచ్చేయి

అదితి యందు కశ్యపునివల్ల ఇంద్రుడు జన్మించినట్లు బ్రహ్మపురాణంలో చెప్పబడింది. వివిధ మన్వంతరాల్లో కలుగు యింద్రుల వివరాలు కూడా ఇందులో చెప్పబడినాయి. దూర్వాసుడు ఇంద్రుని శపించిన వృత్తాంతం దేవీ భాగవతంలోను బ్రహ్మవైవర్తపురాణంలోను చెప్పబడింది. ఇంద్రునకు బ్రహ్మ హత్యాపాతకము కలగడం, వృత్రాసుర వృత్తాంతము స్కాందపురాణంలో చెప్పబడ్డాయి. ఇవికాకుండా ప్రతి పురాణంలోను ఏదో ఒక విధంగా యింద్రుని ప్రసక్తి ఉంటూనే ఉంటుంది. ప్రతి రాక్షసుడూ ఈశ్వరునో, బ్రహ్మనో మెప్పించి వరాలను పొంది యింద్రుని స్వర్గభ్రష్టుని చేయడం తరువాత విష్ణువో, ఈశ్వరుడో ఆ రాక్షసుని సంహరించి యింద్రునకు మరల స్వర్గాన్ని ప్రసాదించడం ప్రతి పురాణంలోను ఏదో ఒక రూపంగా ఉంటుంది

పూర్వకాలపు సమాజంలో యింద్రుడు అనే పదవి ఉండేదని, నూరు యజ్ఞాలు చేసిన వారు ఆ పదవిని అధిష్ఠించేవారని కొందరి అభిప్రాయం. నహుషుడు యింద్రుడు కావడం, ఎవరైనా నూరవయజ్ఞం చేయదలచినప్పుడు యింద్రుడు దానికి భంగం కలిగించడానికి ప్రయత్నించడం మొదలైన కథలు యీ అభిప్రాయాన్ని బలపరుస్తాయి కాని వేదాల్లో భావన మాత్రం యింద్రుడు అనగా ప్రకృతిలోని శక్తి మాత్రమే అనే అభిప్రాయాన్ని బలపరుస్తుంది వేదకాలంలో ఇంద్రుడు అత్యంత ప్రముఖస్థానాన్ని వహించేడు. తరువాత ఇంద్రుని ప్రధాన దేవతగా కొల్చే ఒక మతం ఉండేదని శంకర విజయంలో చెప్పబడింది. కాని అది అంతగా జనాదరణను పొందలేదు. తరువాత ఇంద్రుడు తూర్పుదిక్కునకు అధిపతిగా భావించబడినాడు కాలక్రమంలో యింద్రుడు తన ప్రత్యేకతను కోల్పోయినా, అమిత భోగానికి చిహ్నంగా ఇంద్రపదవి మొదలయిన సామెతల ద్వారా హిందూ సంస్కృతిలో శాశ్వత స్థానాన్ని ఏర్పరచుకొన్నాడు.



## ఇంద్రుడు

## అగ్ని

వైదిక దేవతల్లో యింద్రుని తరువాత ప్రధానమైనవాడు అగ్ని. ఇతడు కొన్నిచోట్ల అపాం నపాత్తు, మరికొన్నిచోట్ల [illegible]

మరికొన్నిచోట్ల దేవతలను తీసికొని వచ్చు గుర్రము గాను,మరికొన్నిచోట్లపక్షిగానుకూడ వర్ణింపబడినాడు.

ఇతడు ద్యౌస్ కుమారుడు. భూమ్యాకాశముల పుత్రుడని కూడా తరచుగా చెప్పబడింది. జలము వల్ల అగ్ని పుట్టిందని కూడా చాలాచోట్ల చెప్ప బడింది. ఇంద్రుడు అగ్నియొక్క సహోదరుడు. దేవతలు అగ్నిని సృష్టించి మానవులకు ప్రసా దించేరు. సమిధలు, నెయ్యి యితని ఆహారం మిగిలిన

## వేల్పులకైనా మార్పులు

దేవతలు యితని ద్వారానే తమ ఆహారాన్ని గ్రహించు తున్నారు. మిగిలిన దేవతలతోపాటు అగ్ని కూడా సోమపానానికి ఆహ్వానించబడుతున్నాడు. రెండు గుర్రాలను పూన్చిన తన స్వర్ణమయ రథంపైన దేవతలను తీసికొని వచ్చుచున్నాడు.

అగ్నియొక్క తేజస్సు విశేషంగా వర్ణించ బడింది. ఇతడు రాత్రులందు కూడా ప్రకాశిం చుతూ చీకట్లను తొలగించుచున్నాడు. కొన్ని చోట్ల అగ్ని ధూమకేతువని కూడా వర్ణించబడి నాడు. దినదినమూ చేయు అగ్నియొక్క ఉత్పత్తి మనోహరంగా వివరించబడింది. అరణులు రెండూ యితని తల్లులు. మథించే పదివేళ్లు పది కన్య లుగా వర్ణించబడ్డాయి. సూర్యుడు కూడా అగ్ని యొక్క రూపాంతరమే అని కొన్నిచోట్ల చెప్ప బడింది. మానవజీవితంతో అగ్నికి అవినాభావ సంబంధం ఏర్పడడంవలన అగ్ని గృహపతి అని పిలువబడ్డాడు. అగ్ని తన భక్తులచేత తండ్రి అనీ, సోదరుడనీ, కుమారుడనీ కూడా స్తోత్రము చేయ బడుచున్నాడు. మానవులు అర్పించిన హవిస్సును అగ్ని దేవతలకు అందజేయుటయే గాక, దేవతలను తీసికొని వచ్చుచున్నాడు. అగ్ని తరచుగా, ఋత్విజు డనీ, పురోహితుడనీ, హోత అనీ, అధ్వర్యుడనీ స్తోత్రము చేయబడుచున్నాడు. యజ్ఞములను గురించి సకల విషయములు అతనికి తెలియుట వలన జాతవేదుడనే పేరు వచ్చింది.

అగ్ని జన్మవృత్తాంతం అగ్నిపురాణంలో వర్ణించ బడింది. బ్రహ్మయొక్క వీర్యము ప్రమాదవశ మున స్ఖలనము కాగా అందుండి అగ్ని ఉద్భ వించినాడు. అగ్ని అయిదు విధములు : (1) బడ బాగ్ని. ఇది సముద్ర మధ్యమున ఉండును, (2) జఠ రాగ్ని. ఇది జీవుల గర్భమందుండి ఆహారమును జీర్ణముచేయును , (3) అరణాగ్ని ఇది కర్రలయం దుండి వాటి ఒరిపిడివలన జన్మించును. (4) ఇంద్రాగ్ని. ఇది ఇంద్రుని వజ్రాయుధమం దుండును. (5) సూర్యాగ్ని ఇది సూర్యునియం దుండును. అగ్నికి రెండు శిరస్సులు ఏడు నాలి కలు. అగ్నిదేవుని వీర్యమే స్వర్ణము. అగ్నియొక్క భార్యపేరు స్వాహాదేవి. వాహనం మేషం అగ్నియొక్క మేష వాహనానికి ఖగోళ విశేషమే కారణమని కొందరి అభిప్రాయం.

జరతుష్ట్ర మతంలో అగ్నిపూజ అత్యంత ముఖ్య మైనది వేదకాలంలో అగ్ని విశేష ప్రాముఖ్యతను వహించినా, భక్తి జ్ఞాన మార్గములు అభివృద్ధి చెందినకొద్దీ అగ్నియొక్క ప్రాముఖ్యత క్రమంగా తగ్గిపోయింది ఆగ్నేయ దిశకు అధిపతిగా మాత్రం పురాణాల్లో గుర్తించబడ్డాడు. మొత్తంమీద అగ్ని పవిత్రతకు చిహ్నంగా హిందూ సంస్కృతిలో శాశ్వ తంగా నిలచిపోయేడు

[ఈ శీర్షిక సమాప్తం.]

## కృతజ్ఞతలు

అనేక గ్రంథాలయాల్లో యెన్నో గ్రంథాలను పరిశీలించిన పిదప యీ వ్యాసాలు వ్రాయబడ్డాయి. ఆయా గ్రంథరచయితలకు, గ్రంథాలయ నిర్వాహ కులకు, ముఖ్యంగా విశాఖపట్నం ఆంధ్ర విశ్వ విద్యాలయ గ్రంథాలయం వారికి, మద్రాసు కన్నెమెరా గ్రంథాలయం వారికి, అనకాపల్లి శారదా గ్రంథా లయం వారికి నా కృతజ్ఞత

స్థలాభావంవలన వదలి వేసిన విషయాలు యీ వ్యాసాలను పుస్తక రూపంలో ప్రకటించినప్పుడు చేర్చబడగలవు అప్పుడు యీ వ్యాసరచనకు తోడ్ప డిన గ్రంథాల వివరాలు కూడా ప్రకటింప బడతాయి.

—మహేష్.★








# వింబుల్డన్ పోటీలలో కృష్ణన్ అవకాశాలు ...?



కృష్ణన్

"ఎవరితో ఆడబోయినా ముందుగా జయాప జయాలను వూహించుకోవచ్చును గాని క్రిష్ణన్‌తో ఆడబోయేముందు మాత్రం అలా వూహించుకోవడం అసాధ్యం." 1962 లో కాబోలు ఒక పత్రికా ప్రతినిధితో జరిపిన ఇంటర్వ్యూలో, భారత లాన్ టెన్నిస్ క్రీడాగ్రేసరుడు రామనాధన్ కృష్ణన్ ఆట గురించి మీ అభిప్రాయం ఏమిటని అడిగిన ప్రశ్నకు సమాధానంగా ఆస్ట్రేలియా డేవిస్‌కప్ ఆటగాడు నీల్ ఫ్రేజర్ పై విధంగా అన్నాడు. ఫ్రేజర్ 1960 లో వింబుల్డన్ విజేత. చాలాసార్లు తన దేశం తరఫున డేవిస్‌కప్ పోటీలలో పాల్గొని విజయాలు సాధించిన యోధుడు. అతడు చెప్పిన ఈ 'నిజం' క్రిష్ణన్ మీద జయాపజయాలు రుచి చూసిన అనుభవంతో కూడుకున్నది.

భారతదేశానికి, ప్రపంచానికి మద్రాసు గర్వంగా సమర్పించిన కానుక రామనాథన్ కృష్ణన్. క్రిష్ణన్ తండ్రి రామనాధన్ కూడా మంచి టెన్నిస్ ఆటగాడు. క్రిష్ణన్ ప్రపంచస్థాయి చేరుకోవడానికి ముఖ్య కారకు డాయన.

క్రిష్ణన్ ఆడుతున్న టెన్నిస్ ఒక కళ, ఒక శాస్త్రం. ఏంటిసిపేషన్ అతడికి డిఫెన్స్ (రక్షణ) అయితే, డ్రాప్ షాట్స్ అఫెన్స్ (దాడి). అతడి ఆటలో బలహీనమైన విషయం—సర్వీసు ఇది అతని ఆటకి విపరీతమైన ఫలితాలని చేకూర్చిందనే చెప్పవచ్చు. ఇప్పుడు అక్తర్ ఆలీ సలహాతో చాలవరకు సర్వీసుని బలపరచుకున్నాడు.

దాదాపు పన్నెండేళ్ల నుండి అంతర్జాతీయ పోటీలలో పాల్గొంటూ ఈ క్రీడలోని ప్రముఖ ఆటగాళ్లందరిమీద విజయాలు సాధించాడు. డ్రోబ్ని, ఆల్మెడో, లేవర్, నీల్ ఫ్రేజర్, ఎమర్సన్, మెకిన్లే (వింబుల్డన్ విజేతలు), బేరీమేకే, అయాలా, స్టోలీ, ఒసూనా, ముల్లిగన్—వీరందరూ ఎప్పుడో ఒకప్పుడు క్రిష్ణన్ చేతిలో వోడిపోయినవారే 1958 లో ఆల్మెడో మీద గెలిచి 'క్వీన్స్ క్లబ్ ఛాంపియన్‌షిప్' కైవశం చేసుకున్నప్పుడు క్రిష్ణన్ పేరు టెన్నిస్ ప్రపంచంలో మరింతగా మార్మోగిపోయింది. తర్వాత జరిగిన వింబుల్డన్ పోటీలో క్రిష్ణన్ ఆల్మెడో చేతిలో వోడిపోయినా (ఆల్మెడో ఆ ఏడాది వింబుల్డన్ విజేత) వెంటనే జరిగిన స్వీడిష్ ఛాంపియన్‌షిప్ పోటీలలోఅతడిని మళ్లీ వోడించాడు.

దేశంలోనే కాక మొత్తం ఆసియాలోనే అద్వితీయుడిగా ఉంటూ వస్తున్న క్రిష్ణన్ తన ఎనిమిదవ ఏటనే టెన్నిస్ మొదలుపెట్టాడు అనతి కాలంలోనే ఆ క్రీడలో మెలుకువలు నేర్చుకుని ప్రవీణు డయ్యాడు. పదహారవ ఏటనే జాతీయ పోటీలలో గెలిచి, రాబోయే కాలంలో దేశానికి తనెంతగా ఉపయోగపడగలడో ముందుగా తెలియబరచాడు. ఆ మరుసటి సంవత్సరం (1954) ఆష్లేకూపర్ మీద గెలిచి జూనియర్ వింబుల్డన్ ఛాంపియన్ అయ్యాడు. అప్పటినుండి ఎన్నో విజయాలు సాధిస్తున్న ఈ క్రీడాకారుడు తమ తమ జాతీయ పోటీలలో పాల్గొనవలసినదని అనేక దేశాల నుండి ఆహ్వానాలను అందుకొంటుంటాడు

డేవిస్ కప్ పోటీలలో భారతదేశానికి వెన్నెముకగా నిలిచి తన జట్టుని ఆసియా మండలం విజేతగా నిలిపాడు ఎన్నోసార్లు. భారతదేశం ఈ పోటీలలో అంతిమ పోటీకి చేరుకోవడానికి క్రిష్ణన్ ఆటే కారణం.

కారణాంతరాలవలన గత ఏడాది (సీజన్) అంతర్జాతీయ పోటీలలో పాల్గొనలేక పోయాడు కృష్ణన్. ఈఏడు ఆఖరిసారిగా అంతర్జాతీయ పోటీలలో పాల్గొంటున్నానని ప్రకటించగానే టెన్నిస్ అభిమాను లందరికీ గొప్ప నిరుత్సాహం, బాధ కలిగాయి. ఏదో వెల్తి కలగబోతోందన్న భావన ఏర్పడిపోయింది ఈ ఆఖరి సీజన్‌లో అన్నిచోట్లా విజయాలు చేకూరాలని నిండు మనసుతో కోరుకున్నారు.

## ఆఖరి అవకాశం :

ఇప్పటి క్రీడా ప్రపంచం గొప్ప వూపులో ఉంది. ఆస్ట్రేలియా క్రికెట్ జట్టు వెస్టిండీస్ యాత్ర పూర్తి చేసిందో లేదో న్యూజిలాండ్—ఇంగ్లండుల మధ్య టెస్ట్ పోటీలు మొదలయిపోయాయి. క్లే—లిస్టన్‌ల మధ్య జరిగిన ప్రపంచ ముష్టియుద్ధం (అత్యధిక బరువు తరగతి) పందెం ఒక నిముషంలో ముగిసిపోవడం పెద్ద దుమారాన్ని లేవదీసింది. ఇటలీ ప్రపంచ బ్రిడ్జి ఛాంపియన్‌షిప్ పోటీలలో గెలుచుకుని ఆ క్రీడలో తన ఆధిక్యతని మరోసారి రుజువు చేసుకొంది ఇది వరసగా ఇటలీ ఏడవ గెలుపు ఒక ప్రక్క మాస్కోలో ప్రపంచ చదరంగం పోటీలు, మంచెష్టర్‌లో ప్రపంచ కుస్తీ పోటీలు, మరోప్రక్క యూరప్ అంతటా అంతర్జాతీయ టెన్నిస్ పోటీలు జరిగిపోతున్నాయి. టెన్నిస్‌పోటీ లన్నింటిలోనూ ప్రఖ్యాతి గాంచిన వింబుల్డన్ పోటీలు జూన్ 21 వ తేదీ నుండి రెండు వారాలపాటు జరుగబోతున్నాయి.

ప్రపంచమంతటా అంతర్జాతీయ పోటీలు ప్రతి ఏడూ జరుగుతున్నా ఫలానా వ్యక్తి ప్రపంచ ఛాంపియన్ అని నిర్ణయించే అధికారయుతమైన ప్రపంచపోటీలు లేవు టెన్నిస్‌లో. డేవిస్‌కప్ పోటీలు ఫలానా దేశం టెన్నిస్ విజేత అని మాత్రమే నిర్ణయిస్తాయి. అయితే వింబుల్డన్ పోటీలలో గెలిచే క్రీడాకారుడు ప్రపంచ ఛాంపియన్ అని అందరూ—అనధికారంగా నైనా—గుర్తిస్తారు. ఈ పోటీలు అన్ని అంతర్జాతీయ పోటీలకు కిరీటం వంటివి. వింబుల్డన్‌లో గెలవడం ప్రతి టెన్నిస్ క్రీడాకారుడి స్వప్నం. అక్కడ ఆఖరిసారిగా తన అదృష్టం పరీక్షించుకోవడానికి క్రిష్ణన్—దేశంలో తను పాల్గొన్న అన్ని ఛాంపియన్‌షిప్ పోటీలు గెలిచి—బయలుదేరాడు. ఈ పోటీలకు ముందుగా ఖ్యాతి గాంచిన అంతర్జాతీయ పోటీలలో పాల్గొంటున్నాడు. అందువలన ప్రపంచంలోని గొప్ప ఆటగాళ్లందరితోనూ పోటీ ఆట ఆడే అవకాశాలు, పై అంతస్తుకి చేరుకున్న కొత్త పాత ఆటగాళ్ల మెలకువలు క్షుణ్ణంగా ఆకళింపు చేసుకునే అవకాశాలు చేకూర్చాయి.

అనుకున్నట్టుగానే ఈ పోటీలలో తన పాత ప్రత్యర్థులు చాలామందితోనూ, కొత్తగా పోటీలలో కాలుపెట్టిన గొప్ప ఆటగాళ్లతోనూ ఆడే అవకాశాలు లభించాయి. వీరిలో ఎమర్సన్ (ఆస్ట్రేలియా—ఇతడు గెలవని అంతర్జాతీయ పోటీ లేదు. గత సంవత్సరం వింబుల్డన్ విజేత), స్టోలీ (ఆస్ట్రేలియా—ఈ సంవత్సరం ఫ్రెంచి విజేత) ఒసూనా (మెక్సికో) ఫోహిలింగ్ (అమెరికా), ఈసీజన్‌లో మంచి అభివృద్ధి కనబరుస్తున్న రీచ (అమెరికా)ల మీద విజయాలు సాధించాడు అయితే సాంటానా (స్పెయిన్) తో ఆడిన ప్రతిసారి క్రిష్ణన్ వోడిపోయాడు సాంటానా ఇప్పుడు మంచి 'ఫారం' లో ఉన్నాడు. స్లో కోర్టులో ఇతనిని వోడించడం ఇప్పుడు ఎవరికీ సాధ్యంకాదేమో కూడా. సాంటానా రెండుసార్లు ఫ్రెంచి ఛాంపియన్‌షిప్ విజేత క్రిష్ణన్—సాంటానాలు వింబుల్డన్ గ్రాస్ (గడ్డి) కోర్టులలో ఆడినట్టయితే క్రిష్ణన్ తప్పక గెలవగలడని అనుభవజ్ఞుల అభిప్రాయం. సాంటానా ఫాస్ట్ కోర్టులలో మంచి ఫలితాలను సాధించే వరకూ అతనికి వింబుల్డన్ గెలిచే అవకాశాలు తక్కువే.

క్రిష్ణన్ జూనియర్ ఛాంపియన్‌షిప్ గెలిచినప్పటినుండి వింబుల్డన్‌లో ఆడుతున్నాడు 1960 లోనూ, 1961 లోనూ సెమీ ఫైనల్సు చేరుకున్నాడు. వింబుల్డన్‌లో సెమీ ఫైనల్సు చేరుకున్న మొదటిభారతీయుడు క్రిష్ణనే! (గౌస్ మహమ్మద్

క్వార్టర్ ఫైనల్స్ చేరుకున్నాడు—1939లో) ఈ రెండు పోటీలలోనూ ఆయా సంవత్సరాల విజేతల చేతులలోనే ఓడిపోయాడు. ఆ మరుచటి సంవత్సరం అక్కడ ఆడుతుండగానే సీలమండ దగ్గర గాయం తగలడంవలన విరమించుకోవలసి వచ్చింది.

రెండేళ్లపాటు దూరంగా ఉండి మళ్లీ వింబుల్డన్‌లో కాలు మోపబోతున్న క్రిష్ణన్ అవకా

## వింబుల్డన్ పోటీలలో

శాన్ని, అదృష్టాన్ని దోచుకోవడానికి పాత ప్రత్యర్థులే మరికొంతమంది కొత్తవారితో వస్తున్నారు. వాళ్లలో బంగెర్ట్‌లు ఉండకపోరు వారు, వూహించని ఫలితాలని తీసుకురాకపోరు. ఇది క్రీడ. ఇందులో అటువంటివాళ్లు కావాలి. బలమైన వాళ్లు అన్నిటికీ తట్టుకుని ఆఖరి వరకూ నిలుస్తారు. గెలుపు సాధించడానికి ఆటలో నేర్పు, స్థాయి మాత్రమే చాలవు వాటితోబాటు మానసికమైన్న, శారీరకమైన ఆరోగ్యం కావాలి అన్ని పరిస్థితులలోనూ తన ఆటమీద తనకి విశ్వాసం ఉండాలి. వరుసగా మూడవసారి ఏషియన్ ఛాంపియన్‌షిప్ గెలుచుకున్న క్రిష్ణన్‌కి అవన్నీ సమకూడాలని మనం అందరం కోరుకుందాం.

—పి. వి. నరసింహారావు.★



# సరాగమాల  వి.ఎ.కె. రంగారావు

తేనెమనసులు జి. ఇ. 35514

తేనెమనసులు చిత్రంలో కేవలం సాహిత్య సంపద వలన మనసులను చూరగొనేది 'దివినుండి భువి' కనే యుగళగీతం. దాశరథి రచన. రచనలో రమ్యత్వానికి సంగీతమూ, స్వర కల్పనా రెండూ యిందులో దిగదుడుపే చూడండి.

"దివినుండి భువికి దిగివచ్చె
పారిజాతమే నీవై
గుడిలోని ప్రతిమ వచ్చింది
కోటిప్రభలతో నీవై"

అప్పైన

"కనరాని దేవుని కనుల చూడాలని
కలగంటి నొకనాడు ఆనాడు
కల నిజము చేసి కౌగిలిలో చేర్చి
కరిగించె ఈనాడు"

ఇందులో "కరగించె నీనాడు" అంటే "కరగించేవు యీనాడు" అని వుంటేమెరుగేమో! ఈ ఒక్కటి మినహాయిస్తే యీ రెండు మూడు నెలల్లో విడుదలయిన సినిమాలలో పాటలలోకి యిది ఆణి ముత్యమే.

కె.వి. మహాదేవన్ అమర్చిన వరుస సాహిత్యానికి అన్యాయం చేయలేదు. కాని ఆ మృదుత్వానికి తన స్వర సౌరభాన్ని చేర్చలేదు. ఇది లోపమే. సుశీలా—ఘంటసాల పాడటంలో ప్రత్యేకతలేదు.

రెండవ ప్రక్క నున్నది ద్రిల్‌మాస్టారు పాట. దీని గురించి నేను చెప్పగలిగినదంతా ఆ పాటలోనేవుంది. ఈచిత్రంలో "అదిలేకున్నా ఫరవాలేదు." పోగా చెప్పుకోవలసినది అందులో వినిపించిన పద్మనాభం కంఠం. సినిమాలో అంతా కృష్ణకు పద్మనాభం కంఠం యెర విచ్చాడని చెప్పుకుంటున్నారట. శుద్ధ అబద్ధం. రాచిరాపెట్టి సంభాషణలు సంతృప్తికరంగా వచ్చేదాకా కృష్ణతోనే చెప్పించారు. పాటలో మాత్రం పద్మనాభం చేత, స్వరం శ్రుతిలో వుండాలి కాబట్టి, చెప్పించారు.

*   *   *

ఇక్కడ పద్మనాభం గురించీ సుశీలగురించీ వేర్వేరుగా చిన్న సైడ్‌ట్రాక్. మొదట పద్మనాభం పేటాక్.

సుమారు రెండు దశాబ్దాల క్రిందట శ్రీమతి వారి "రాధిక"లో బాలసరస్వతి వేసిన రాధతో పద్మనాభం కృష్ణుడుగా వేషం వేసి కొన్ని పాటలు పాడటం చాలా కొద్ది మందికే గుర్తుంటుంది. ఆతరువాత చాల సంవత్సరాలకు విజయావారి "చంద్రహారం"లో "ఏంచేస్తే అది ఘనకార్యం" పాటలో వినిపించిన బృందగానంలో పద్మనాభం కంఠం కూడా (వల్లం నరసింహారావుతో సహా) వున్నది. ఇటీవల 'మూగమనసు'ల్లో పద్మనాభానికి 'డైరెక్ట్‌టేక్' పద్యం వున్నది. 'తేనెమనసుల' 'డ్రిల్‌మాస్టారు' లో కేవలం 'యెఫెక్ట్స్'మాత్రం ఇప్పుడు తన సోదరుడు నిర్మిస్తున్న "దేవత" చిత్రంలో పద్మనాభం విల్లూరీశ్వరితో కలిసి ఒక యుగళగీతమే పాడివేశారు. పల్లవి 'నాపేరు రాందాసు నావూరు మదరాసు' రచన కొసరాజు. సంగీతం కోదండపాణి. వరస పాడుకోవటానికి సులభంగా రచన ఆడుకోవటానికి హాయిగా వున్నది. చిత్రం యెప్పుడు విడుదలవు తుందో తెలియదు కాని ఈపాట పైనెలలో విడుదల కావచ్చు.

ఇక సుశీల గురించి. సుశీల కంఠం అద్వితీయ మైనది. ఆమె పాడిన పాటల్లో నూటికి తొంభై యెనిమిది చాలా హాయిగా పాడుతుంది. ఆ మిగిలిన రెండూ మరింత హాయిగా వుంటాయి. పాట, సాహిత్యం వచ్చినా నచ్చక పోయినా సరే ఆ కంఠ మాధురికి దాసోహమ్మనవలసినదే. అటువంటి తేనెవాకలో తేలియాడి... పాటలు "భాగ్యరేఖ"లో 'నీవుండేదాకొండపై', "పరువు ప్రతిష్ఠ"లో 'గిరిధారి', "కర్ణ"లో "నీవు నేను వలచితిమి." ఈమూడింటిలో తక్కి... హంగులు బాగున్నవి. అంటే అవి కేవలం కాకతా... యమే. నాటిలో ప్రథమ బహుమతి నం... కొనేది ఆమె కంఠమే. ఆ తీయని రవళి సురే... వారి "ప్రతిజ్ఞా పాలన"లో "రామచిలుక... పాటలో మరల పల్లవించింది. రచన ఆరుద్ర... సంగీతం వేణు పాడినది పూర్ణచంద్రికా ని... య్యైన చకోరిక. రికార్డు విడుదల త్వరలో... అచిత్రంలో మరొక మంచి పాట ఆరుద్ర... "ప్రేమగీతం" రెంటిరెండు!?

## "మీకు నచ్చిన మంచి పాట"

ఇంతకు ముందు పోటీలన్ని గంధర్వ ప్రశ్నలవంటివే వాటికి జవాబులు దుస్సాధ్యమని కొందరు వ్రాసినదీ నిజమే. కాబట్టి యిది చాల సులభ సాధ్యమయిన పోటీ.

1964 జనవరి 1 వ తేదీ నుంచి డిసెంబరు 31 వ తేదీ వరకు విడుదలయిన సినిమాల తెలుగు చిత్రాలలో (డబ్బిడ్ చిత్రాలు పనికిరావు.) మీకు నచ్చిన పాటలు, సాహిత్యపరంగా సంగీత పరంగా ఒక్కొక్కటి పేర్కొనండి. ఆ తరువాత ఆయా విభాగాలలో ఆ రెండూ మీ కెందుకు నచ్చినవో చెరి అయిదు వాక్యాలు వ్రాయండి. మీ జవాబులు (మామూలు ఎక్సర్ సైజు పుస్తకానికి రెండింతలైన) అరటావు కాగితంపై ఒక ప్రక్కనే వ్రాయాలి. ఆ జవాబులు యీ విధంగా వుండాలి.

నాకు నచ్చిన పాటలు.

సాహిత్యం-'మల్లీశ్వరి'లో "పిలచిన బిగువటరా"

సంగీతం-'విప్రనారాయణ'లో "రారా నా స్వామి"

ఈ కారణాల చేత : (ఒక్కొక్కదాని గురించి ఐదు వాక్యాలు మాత్రం వ్రాయాలి.)

నచ్చిన పాటలలో సంగీత సాహిత్యాలకు ఒకదానికే ఆ స్థానం యివ్వవచ్చునను కుంటే ఆ పనే చేయండి. అందరి జవాబులు బేరీజువేసి ఆ ఫలితాలతో అంగీకరించే పాఠకుల జవాబులు యెన్ని, వాటిలో అర్హమైన వాటికి (వారు వ్రాసిన కారణాలబట్టి) పదింటికి బహుమతులు యివ్వడం జరుగుతుంది. బహుమతిగా మొదట వచ్చిన పాటల రచయిత, సంగీత దర్శకుడు వీరి ఫోటోలు-ఆటోగ్రాఫ్‌తో సహా పదిమంది విజేతలకు పంపబడుతాయి. మీ పత్రాలు జూలై పదవ తారీఖులోపల మాకు చేరాలి. కవరు మీద 'సరాగమాల' పోటీకి అని స్పష్టంగా వ్రాయాలి.

**చిత్రలోకం చిత్రమైనది. ఈ లోకంలో కనిపించేటంత వైవిధ్యమూ, వైచిత్రీ మరెక్కడా కనిపించవు. రకరకాల వ్యక్తుల సంగమం ఇది.**

ఈవాతావరణంలో తిరిగే ప్రతి వ్యక్తిలోనూ ప్రయోజకత్వంతోబాటు అప్రయోజకత్వం కూడా వెలుగుకు నీడలాగా, పూవుకు తావిలాగా అంటిపెట్టు కొనేఉంటుంది. కాని వారి వారి ప్రతిభా విశేషాలు—వ్యుత్పత్తి, అభ్యాసాలతో నిమిత్తంలేకుండా, పరిస్థితులనుబట్టి, అవకాశాల ఆవిర్భావాన్ని బట్టి వెద జిమ్ముతూ ఉంటాయి. ఒక దశలో మారుమ్రోగిన పేర్లే మరో స్థితిలో వినిపించేందుకు సైతం కరువైపోతాయి. ఎలాంటి తత్వాలున్నా, ఎన్ని రకాల వ్యక్తిత్వాలున్నా అందరికీ ఒకటే లక్ష్యం—అదే వ్యాపారం—అదే ఫక్తు వ్యాపారం.

సినిమాలు తీసేవారూ, చూపించేవారూ, తీయించేవారూ — చూచేవారూ, యిలాంటి వాతావరణానికే అలవాటుపడిపోయారు. ప్రేక్షకుల అభిరుచులకు సరిహద్దులంటూ కొన్ని ఉన్నాయనే అపోహ దర్శకుల్లోను, (దర్శకుణ్ణి సైతం ఒక్కో మారు దర్శకత్వం చేసే) కొందరు నిర్మాతలోను ప్రబలిపోవటంవల్ల, నిజంగా ప్రతిభావంతులయిన వారి తెలివితేటలకు సంకెళ్ళు పడిపోతున్నాయి. ఫలితంగా, ఈనాడు తయారయ్యే సినిమాలలో ఆశయసిద్ధి కనిపించకపోగా (అసలు ఆశయం ఉందా), ప్రేక్షకులను తక్కువగా అంచనా వేయటం పరిపాటి అయిపోయింది. అందువల్లనే మన సినిమాలో ఎదుగూ, బొదుగూ లేదు. ఏ సినిమా చూసినా అవే సన్నివేశాలు, అవే కృత్రిమ సంఘట [illegible]

ఇలాంటి స్థితిలో, యీ వాతావరణం నుంచి రెండు గంటలసేపు మనల్ని తప్పించగల ఎలాంటి ప్రయత్నమైనా విజయవంతం అవటానికి అవకాశం ఉన్నది. కాని, అలాంటి ప్రయత్నం వేయటానికి సాహసం, నేర్పు ముఖ్యంగా కావాలి. ఢక్కామొక్కీలను ఎదుర్కొనగల ధీమా కావాలి!

*   *   *

జయకాంతన్ పేరు చెప్పగానే ప్రతి తెలుగు వాడూ, 'ఈయ నెవరు ?' అని వెంటనే అడుగుతారు.

సమాధానం : జయకాంతన్‌ను ఒక్క మాటలోనో, ఒక్క వాక్యంలోనో సంక్షిప్తపరచలేం!

అందరికీ కావలసిన కథలు రాయటం చేతకాని సుప్రసిద్ధ కథకుడు జయకాంతన్, అందరికీ కావలసిన సినిమా తీయకుండానే అందరివాడయ్యాడు.

—మనుషులుంటారు—సినిమా కాదు జీవితం ఉంది ఇందులో.

చిట్టి అనే పధ్నాలుగు, లేక, పదిహేనేళ్ళ అబ్బాయి యీ కథలో ముఖ్యుడు. వాళ్ళ అమ్మ 'తంగం' కూలీపని చేసి బ్రతుకుతూ ఉంటుంది. సందర్భవశాత్తు 'మాణిక్కం' అనే 'చిలక జోస్యం' చెప్పే వ్యక్తితో ఆమెకు పరిచయం అవుతుంది. మాణిక్కం వేరే తోడు—నీడ లేనివాడు. తంగం భర్త లేనిది. వాళ్ళిద్దరూ సన్నిహితులు కావటం, మాణిక్కం కూడా తంగం గుడిసెకే చేరటం మొదలయిన సంఘటనలు చిట్టిని కలవరపరుస్తాయి. తన తల్లి తనమీద చూపవలసిన అనురాగం మున్ముందు పొందలేక పోతాననే భయం అతనిలో జనిస్తుంది. పైగా, తన తల్లి మరో వ్యక్తితో జీవనం గడపటం చిట్టికి రుచించదు.

ఇంతలో తంగం గర్భవతి అవుతుంది. చిట్టి ఆ యింటినుంచి దూరమవుతూ ఉంటాడు తంగం ప్రసవించటానికి ఆస్పత్రికి వెళ్ళినా, చిట్టి మాత్రం ఎక్కడెక్కడో తిరుగుతూ ఉంటాడు. చెల్లెలు పుట్టిందన్న వార్త కూడా చిట్టిని అంతగా కదలించలేకపోతుంది తంగం ఇంటికి వస్తుంది. అనారోగ్యంతో బాధపడుతున్న తంగం మృత్యువుకు చేరువలోవున్న క్షణాన, యీ వార్త విన్న చిట్టి అక్కడకు వస్తాడు. తంగం చిట్టిని చూస్తుంది. చిట్టికి మొదటో, కూడా తండ్రి అంటూ ఎవ్వరూ లేరని, చెల్లెలు జన్మించిన పద్ధతికీ, చిట్టి జన్మించిన పద్ధతికీ పోలిక ఉన్నదనీ తంగం చెపుతుంది.

"ఈ చెల్లెలుకు నువ్వు అన్నయ్యవి నీలాంటి అన్నయ్య ఒకరు నాకూ ఉన్నట్టయితే నేను కూడా బాగుండేదాన్నిరా చిట్టీ. నీ చెల్లెలును జాగ్రత్తగా చూసుకో. మంచి అన్నవు నువ్వు! మంచి చెల్లెలు నీకుంది" అని చెప్పి తంగం చనిపోతుంది

**అసలు ఆ అమ్మా యెవరు ? తనెవరు ? అ విన్న**

దక్షిణాదికొక సత్యజిత్ రాయ్



# చిత్రసీమలో జయకాంతన్ ముందడుగు

ఈ ఏడాది నిర్ణయింపబడిన ఉత్తమ చలన చిత్రాలలో మూడవది జయకాంతన్ తీసిన 'ఉన్నైప్పోల్ వరువన్'. మొదటి స్థానం సత్యజిత్‌రాయ్ 'చారులత'కు, రెండవస్థానం 'హాకీ కత్' కూ లభించాయన్నది తాజావార్త కాదు!

ఊరు, పేరు లేని జయకాంతన్ తీసిన వూరు పేరు లేని తమిళ సినిమాకు ప్రభుత్వం గౌరవాన్నిచ్చింది. అదే గర్వకారణం.

జయకాంతన్‌ను గురించి పూర్తిగా చెప్పే ముందు ఆయన తీసిన సినిమాను గురించి నాలుగు వాక్యాలు

"ఉన్నైప్పోల్ వరువన్" అంటే "నీలాంటి మరొకరు" అని అర్థం. ఆయనే లోగడ వ్రాసిన ఒక కథనే సినిమాగా తీశారు.

పేరుకు ఇది సినిమాయే అయినా, అన్ని సినిమాల్లాంటిది కాదు. ఇందులో ఆటలు, పాటలు ఉండవు. **ప్రేమ, విరహం అంతకన్నా లేవు. పాత్రలు ఉండవు**

ఉత్తమ కథా వస్తువు
(హృదయాలను కదిలించే సన్నివేశాలు)
చక్కని సంగీతం
చాలా మంచి చిత్రం
తప్పక చూడండి!

















వారి

విజయభట్ మూవీస్



# తోడూ నీడా

దర్శకత్వం ఆదుర్తి సుబ్బారావు నిర్మాతలు ఎన్.ఎన్.భట్ & ఎ. రామిరెడ్డి

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6&7 Thambuchetty Street
Madras-1. Phone: 22766 & 23713. Chief Editor S. Sambhu Prasad.